ఓం

# జవహర్‌లాల్ నెహ్రూ

## చారిత్రము

గ్రంథకర్త:

పండిత యస్. యస్. నారాయణశాస్త్రిజీ.



ప్రకాశకులు:

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు,

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

వెల రు 0—8—0

# విషయసూచిక

# జవహార్ లాల్ నెహ్రూ చారిత్రము

## ౧ వంశము—బాల్యము

భారత దేశమున కుత్తరపు సరిహద్దున హిమాలయ పర్వత పంక్తి వ్యాపించి యున్నది. ఆపర్వత శిఖరమునుండి సంతతధారగ గంగానది ప్రవహించుచుండును. నదీపరిసరము లమూల్యములగు నౌషధుల కాకరమగుటయేగాక సరళ దేవ దారు వృక్షములతోడను చమర కస్తూరి మృగములతోడను నొప్పియుండుటచే నీప్రాంతమును దేవభూమి యని యనేకులు వచించు వాక్యము సార్థకమని చెప్పుటకు ఋషిసత్తముల కాటపట్టయి వారికాత్మతేజమును మనోబలమును కలిగించు శక్తి యీప్రదేశమున కుండుటయే కారణమనక తప్పదు. అచటి ప్రకృతి సౌందర్య మపారము. కాళిదాసాదులు పాశ్చాత్త్యులు నచటి సౌందర్య విశేషములను వేనోళ్ళ పొగడుటయే దానికి తార్కాణము.

ఈప్రాంతపు వాయువ్యభాగమున కాశ్మీర మలరారుచుండెను. ఇచ్చటి ప్రకృతి రామణీయకము చూడ వేడుకగ నుండునని ప్రసిద్ధికలదు. ఇచటి ప్రజల కెత్తగు నుదురు, విశాలమగు వక్షము, తళతళలాడు కనులు మోకాళ్ళవంటి చక్కని బాహువులు, తెల్లనిశరీరము కలిగి యలరారుచుందురు. మా పూర్వగ్రంథములయం దార్యులని వర్ణింపబడినవారిని వీరు పోలియుందురు.

వీర లాకార విశేషముచేతనే కాక, ధీరత్వము, సాహసము, ఉదారత, భుజబలపరాక్రమము కలిగి సకలకార్యములకు నెరవు సమర్థులుగ నుందురు. ఈ కాశ్మీరమే నెహ్రూగారి స్వస్థలము. కాశ్మీరదేశస్తుల చిహ్నములన్నియు నేటికిని నెహ్రూలయందు కానవగును.

ఔరంగజేబు పరిపాలనానంతరమున మొగలుసామ్రాజ్య మీదేశమున నంతరింప కాశ్మీరప్రాంత మల్ల కల్లోలములకు నశాంతికి నిలయమైన కారణమున నచటి ప్రజలకా ప్రదేశమున సుఖముగ జీవించు మార్గము తప్పుటచే కొన్ని కుటుంబములతో పాటు రాజకౌలను నొక బ్రాహ్మణుడును ఢిల్లీనగరమును చేరెను. అచట నపుడు రాజ్యమేలుచున్న మొగలు చక్రవర్తి ప్రజ్ఞావంతుడగు రాజకౌలు నాదరించి తన యాస్థాన పండితునిగ జేసెను. ఉండుటకొక యింటిని యమునయొద్దన కట్టించి యిచ్చుటయేగాక నొక జాగీరును బహుమతిగ నొసంగెను. రాజకౌలు సంస్కృతమునందును పారసీ భాషయందును మేటి పండితుడగుటచే పాదుషాగారి పిల్లకు పారసీ బోధించు గురువుగ పనిచేయుచుండెను. రాజకౌలు యమునయొద్దన నుండుటచేత, నచటి నాడుభాష యగు హిందీయందు కాలువకు 'నహర్' అను పేరగుటచే రాజకౌలు కుటుంబమునకు కౌలు నెహ్రూలను వాడుక కలిగినది. కొంతకాలమునకు కౌలను నామ మంతరించి 'నెహ్రూ' అను పదమే వారి వంశనామమయినది.

నెహ్రూల జాగీ రంతరించినది. రాజకౌలు మునిమనమడు లక్ష్మీనారాయణ నెహ్రూ ఢిల్లీలో బ్రిటిషు కంపెనీవారి మొదటి వకీలుగ నుండెను. ఆయనకేక పుత్రుడగు గంగాధర నెహ్రూ ఆపురమునకు కొత్వాలుగ నుండెను.

1857 లో సిపాయిల తిరుగుబాటు జరిగినపుడు దేశీయులు, మొగలు రాజును చక్రవర్తిగ జేయ ప్రయత్నించిరి. ఈ తిరుగుబాటు జరిగినది ఢిల్లీయందే యగుటచేత నిపాటివారితో పాటు గంగాధరుడును ఢిల్లీనివీడి కుటుంబసహితముగ నాగ్రా నగరమును చేరి యందు వసించెను. అపుడు బ్రిటిషు వారికి గోల్కొండ సేనలును భారతసేనలును సాయముచేసినవి. తరువాత కొన్ని నెలల కల్లోలములణగి బ్రిటిషు రాజ్యము నిలబడినది. గంగాధరుడు 1861 లో చనిపోయెను. అతని కప్పటి కిద్దరు కొమారులేగాక యిరువురు కొమార్తెలు నుండిరి. 6—1—1861 తేదీని తుదికొడుకగు మోతీలాల్ నెహ్రూ జన్మించెను. ఆతని ప్రథమపుత్రుడె మన కథానాయకుడగు జవహరులాల్ నెహ్రూ.

మోతీలాలుగారి భార్య స్వరూపరాణి. ఆమె కాశ్మీర బ్రాహ్మణ కుటుంబమునకు చెందినది. ఈమె మంచి అందమయినదియెగాక దయయు, దానగుణము గలది. ఈయుభయులకును మొదట జవహర్ లాల్ 14—11—1889 న అలహాబాదు నగరమున జనియించెను. మోతీలాలు నెహ్రూగారు తమకు

పుత్రుడు పుట్టినపుడు చాలమంది బీదల కన్నవస్త్రములను దానముచేసే గొప్ప యుత్సవమును జరిగించిరి. జవహరు తల్లి దండ్రుల కేకపుత్రుడు. తండ్రి భాగ్యవంతుడగుటచే జవహరుని బాల్యము తండ్రియింట మహారాజయోగముగ గడచినది. మోతీలాలుగారు రపు ఇాంగ సాంప్రదాయము ననుసరించి యుండుటచే జవహరున కాంగ్లదారులే పోషణకు నియమింప బడిన వారగుటచే జవహరున కాంగ్లాక్షరములను వారే నేర్పిరి. తండ్రి కొక్కకొడుకగుటచే యేవిషయమునను లోటు లేకుం డెను. తోడ నాడుకొనుట కింట తన యీడువారెవ్వరాతనికి లేరు. (మోతీలాలుగారాతనినే బడికిని బంపక యింటనే చదువు చెప్పుట కుపాధ్యాయులను నియమించి చదువు చెప్పింప గడం గిరి. వారియింట చదువుకొనువారు చాలామంది బంధువు లుండిరి. కాని వారెల్లరు కాలేజీయందు చదువుకొనువారు జవహరు వారిసంభాషణను, తండ్రి తన స్నేహితులతో నాడు మాటలను చాటు చాటుననుండి వినుచుండువాడు. రైళ్ళలో భారతీయులకు నాంగ్లేయులకు జరుగు తగవులాటలను అందు మనవారికి జరుగు అన్యాయములను విద్యార్థులు చెప్పుకొనుట వినుచుండువాడు.

ఆ సంగతుల మర్మ మప్పు డతనికి తెలియకపోయినను లోకమున జరుగు సంగతులు కొద్దికొద్దిగ గ్రహించు సమర్థత కలుగుచుండెను. మోతీలాలుగారి సమర్థత ధైర్యసాహసములు బుద్ధికుశలత, స్వతంత్రత జవహరునకు కలుగఁ జొచ్చినది.

తండ్రికుండిన దురుసుతనము తొందరపాటు యొడిదుడుకుపనులు మాత్రి మీాతని కబ్బలేదు. తండ్రియొద్ద చనువుకన్న జవహారు నకు భయమే అధికము. వేప్రమాస్పదు రాలగు తల్లితో ననగి బెనగియుండి యామె నతడు చాల సంగతుల నడిగి తెలిసికొను చుండెడివాడు. మోతీలాలుగారు కోపము నాపుకొనలేని స్వభా వము కలవారగుటచే తన బల్లపై గల రెండు పౌంటెను కలము లలో నొకదానిని చెప్పకయే జవహరు సంగ్రహించుటచే నది తెలుసుకొని మోతీలాలుగారు తన కొమరునకు చిన్ననాడే దొంగతన మబ్బునను భయమున కొడుకును చితుకకొట్టి అందుచే బాధపడు కొడుకున కనేకోపచారములు చేయించెనట జవహారు తన తండ్రియంత పుష్టిగల శరీరము గలవాడు కాడు కాని యరిపేదమాత్రము కాడు.

జవహారు బాల్యమున గుఱ్ఱపుస్వారి చేయుటయేగాక తమ యానంద భవనమున కంటియుండు తోటలోగల పెద్ద చెరువునం దతడు తరుచు యీదులాడుట కలవాటుపడినవాం డగు కతమున గజ యీతకాడయ్యెను.

అతఁ డొక పండితునిచెంత కొంత సంస్కృతమును నేర్చుకొనెను. ఉరుదు నొక మున్షీయొద్ద బాగుగ నేర్చుకొనెను. పురాణ గాధలను నందలాలుగారి భార్యవలను పుస్తకాధారము వలనను బాగుగ గ్రహించగలిగెను. జవహారు 12 సంవత్సరముల యీడుననే ఎఫ్. టి. బ్రూక్సను విద్వాంసుని (థియాసఫిస్టు)

ప్రత్యేక బోధకునిగ తండ్రి నియమించెను. అతఁడు జవహారున కాంగ్లసాహిత్యమును చక్కఁగ నేర్పెను. జవహారుని తెలివి తేటలను కనిపెట్టి బ్రూక్సుగారతనికి పస్మృతి శాస్త్రగ్రంథము లను, ఉపనిషత్తులను, భగవద్గీతను, బౌద్ధమతగ్రంథమగు ధమ్మ పదమును, గ్రీకుతత్వగ్రంథములను చదివించి యతనిని ప్రవీణునిగ నొనర్చెను.

జవహారు బ్రూక్సుగారివద్ద దివ్యజ్ఞానమతపు సిద్ధాంత ముల నేర్చుకొని ఆసమాజము కర్త్యత్రురాలగు అనీబిసెంటుగారి వలన థియాసఫీసమాజమున జేర్చబడెను. ఆమె మాటలాడుట వినియుండుటచే జవహారున కామెవంటి వాగ్ధాటి, ప్రతిభ, వర్చశ్శక్తి యలవడినవి. పై యుభయుల సాంగత్యమునను మన దేశపు పూర్వుల యౌన్నత్యమును గూర్చి చక్కఁగ వినియుం డెను. అందుచే మన దేశీయులకు ఆత్మగౌరవము, ఆత్మవిశ్వా సము, అవసరములని బ్రూక్సుగారివలన వినినమాట జవహారు నాత్మయందు నాటుకొని మఱియున్నతిని గూర్చియు దేశీయ భావములను గూర్చియు నభిరుచి యేర్పడి యందులకై పాటు పడు మేఁటి యాశయ మాతని మనమున పొడసూపినది.

తరువాత 1904 లో నొక యేఁడాదిపాటు జవహారు గార్డనుగారను నొక హైస్కూలు ప్రధానోపాధ్యాయుని చెంత విద్య నేర్చుకొనెను. బాల్యమునుండియు నీతఁడు వార్తాపత్రికలను జదివి విషయమును గ్రహించు నాచారము గలదు. అందు విదేశ విషయములనుగూడ శ్రద్ధతో జదువువాఁడు.

1902 లో బోయరు యుద్ధవార్తలను చదివి డచ్చివారు పూర్వము దక్షిణాఫ్రికాకు వలసపోయి నివాసము లేర్పరచుకొని బోయర్లనబడుచు ట్రాన్స్వాలులో స్వతంత్రులుగ నుండిరి. బ్రిటిషుప్రభుత్వమువారు బోయర్లపై దండయాత్ర సలిపి వారిని వశపరచుకొన దలచినపుడు బోయరు ప్రజలు కొద్దిగ నుండియు తమ స్వతంత్రమును కాపాడుకొనుటకై జీవితములను ధారపోయ సిద్ధపడి తమకన్న బలీయులగు బ్రిటిషువారితో హోరాహోరిగ పోరగడంగిరని పత్రికలలో చదివినపుడు జవహరున కానంద మొదవినది.

1904 లో రష్యా సామ్రాజ్యము చాలబలీయమైనదై పేరాసచే తూర్పునగల మంచూరియాను మ్రింగజూచి దానికి తూర్పు తుదనుండు జపాను సముద్రతీరమందలి పోర్టుఆర్థరు మొదలగు రేవు పట్టణములను కబళింపచూచినపుడు చీనారాజు తాను చక్రవర్తియయ్యు రష్యా సేనల నెదిరింపక యూరకుండెను.

అచట సమీపముననున్న చిన్నరాజ్యమగు జపానునకు రష్యాదేశపు పేరాశ సహింపరానిదిగ కనుపడ తామల్ప సంఖ్య కలవారయ్యు చాలధైర్యసాహసములతో తమ స్వతంత్రతను కాపాడుకొని తమ దేశమునకు విపత్తు రాకుండుటకు ముందే జాగ్రత్తపడదలంచి 1904 లో రష్యాతో యుద్ధ మారంభించిరి. ఆసియా యూరపుఖండముల యందు దర్పభాగము నాక్రె

మించిన పాశ్చాత్యసామ్రాజ్యముతో కొద్దిజన సంఖ్యగలిగిన వారయ్యు సాహసవీరులగు జపానీయులు ప్రాణములకు తెగించి పోరి దేశస్వాతంత్ర్యమును కాపాడుటకు వారొనర్చిన సాహసమును పత్రికలయందు చదివినపుడు జవహరుని మనోవీధిని యుత్సాహ మినుమడించి మెచ్చుకొనునట్లు చేసినది. అప్పటికి యుక్తవయస్కుడు గాకుండియు యుద్ధపు చతురతను వారి సాహసమును చదివి సంతసించుటయేగాక జపానువారి జాతీయ చరిత్రమును తెలుపుగ్రంథములను చదివి వారిపై మెనలేని నాదరభావము జనింప సమ్మోదపడెను పదునారేండ్లనాటికే జవహరు చాల వేగముగ జ్ఞానార్జనమును చేయుచు వంగదేశ విభజన వృత్తాంతమునే గాక విదేశవృత్తాంతములను సహితము చక్కగఁ దెలిసికొను రాజతంత్రముల సారమును వాటినీతిని గ్రహించుచు రాజతాంత్రికుల యెత్తులను యుక్తులనుగూడ బాగుగఁ దెలిసికొన గలిగియుండెను.

## విద్యావిషయమున సమాలోచనము

పదునేనేండ్లవరకు జవహరున కింటనే గురువులవలనవిద్య గరుపబడిన విషయ మిదివరకే తెలుపబడినను తదుపరి విద్యకు పూనుకొనవలసిన సమయమగుటచే మనదేశపు కాలేజీలకన్న నింగ్లండులోని కళాశాలలో బోధనాపద్ధతి విజ్ఞానదాయకమైన దగనుండి లోకజ్ఞానమున కెక్కుడవకాశ మిచ్చుననియు స్వతం

త్రిత, కార్యశూరత, చతురత, నాదేశప్రజల సహవాసమున బాగుగ నలవడుననియు, కుమారుడందుచే ప్రభావసమర్థుడు కాగలడనియు, తనకన్న నెక్కువ పేరుప్రఖ్యాతులను తేగలడనియు మోతీలాలుగా రప్పటి పరిస్థితిని బాగుగ నాలోచించియు బాలునొంటరిగ విదేశమున కంపుట కిష్టములేనివారై తామే తమ కుమారునివెంట నిడుకొనవెళ్ళుట శ్రేయమని కుటుంబసహితముగ 1905 వ సంవత్సరపు మే నెలలో బైలుదేరి హారో గ్రామమందలి పబ్లిక్కు స్కూలులో జవహారును జేర్పించిరి. కుమారు నందు విడచి యూరపు దేశము నలుమూలలను తిరిగిచూచి స్వదేశమునకువచ్చి చేరిరి. పబ్లికు స్కూలునందలి పద్ధతులు భాగ్యవంతుల కనువైనవి. ధన వ్యయము మిక్కుటము. అందువిద్యతోపాటు యూరపియునుల సంఘమర్యాదలు, ఆటపాటలు నేర్పబడును. ఆ రోజుల యందు హారోస్కూలులో బరోడాకపూర్తలాల యువరాజులు విద్యార్థులుగ నుండిరి. మన జవహరుగా రా స్కూలునందు లాటిను ఫ్రెంచి భాషలను నేర్చుకొనెను. అచటకూడ నీతడు వార్తా పత్రికలను చదువుచు ప్రపంచమందలి ఆర్థిక రాజకీయోద్యమములను బాగుగ గ్రహించుచు, వాని మూల సూత్రములను చక్కగ తెలిసికొనుటకై వాటికి సంబంధించిన గ్రంథములను చదువగడంగెను. రష్యాజపాను యుద్ధ మా సమయమున ముగిసినది. ఇంగ్లండులో పార్లమెంటు యెన్నికలు జరిగినవి. అందుదారపక్షమగు లిబరలు పార్టీవారు పాలక

వర్గముగ నేర్పడిరి. ఈసంగతుల నాతురతతో చదివి జవహరు చాల నుత్సాహమును పొందెను. తమ బడియందలి యుపాధ్యాయుడు క్లాసు పిల్లలను క్రొత్తగనేర్పబడిన మంత్రివర్గము గూర్చి చెప్పుడని యడుగగ నొకబాలుడును జవాబు చెప్పకుండ నుండ జవహరు మంత్రివర్గపుసంగతులను సమర్థతతో తెలుపుటయేగాక శాఖామంత్రి యెవ్వరో పేర్లుగూడ తబ్బిబ్బుగాకుండ చెప్పినపు డాయుపాధ్యాయుం డాశ్చర్యమున మునిగెనట.

అల్పసంఖ్యాకులు తమ స్వతంత్రతకై పోట్లాడిన సంగతులను చదువు నపుడు జవహరున కొకవిధమగు నుత్సాహము మనమున జనించుట గలదు. అట్టి సంగతులను పత్రికలయందు చదువునపుడు హిందూదేశమున కెప్పుడు స్వతంత్రతయులవడునా యను తలంపాతని మనమున కలుగుటయు కలదు. యూరపు నందలి యిటలీలోని చాల భాగము 12 వ శతాబ్దమునం దాస్ట్రియారాజ్యమునకు వశమై అప్పటి యిటాలియనులు యిప్పటి మనవలె పరస్పరము తగవులాటలతో పెనగులాడుచుండుటచే వారియం దైక్యమును గుదిర్చి స్వాతంత్ర్యవాంఛను జాతీయోద్రేకమును కలిగించి స్వతంత్రులను చేయు పాటుపడిన గారిబాల్డి యను దేశభక్తుడగు ప్రముఖుని గ్రంథము జవహరునకు బహుమానముగ దొరకిన నతడు దానిని శ్రద్ధతో చదివెను. ఐర్లండులో నపుడు జరుగుచున్న స్వాతంత్ర్యోద్యమ సంగతులను వివరముగా జదివి యుంగ్లండునకుపోయి సిన్‌ఫీన్

స్వరాజ్యవాసుల పద్ధతులను బాగుగఁ దెలిసికొనెను. 1905 లో వంగదేశపు విభజన జరిగినపుడు దేశమంతటను రాజకీయాందోళన బయలుదేరినపుడు దాదాభాయి నౌరోజీగారు 1906 సం॥ సాలాఖరున కలకత్తా కాంగ్రెసుసభకు చివరిసారి యధ్యక్షుఁడుగ నుండినపు డాయన దేశీయులకు స్వరాజ్యతత్వసౌకర్యమును దెలిపి యందులకు విదేశవస్తుబహిష్కారమును, స్వదేశవస్తు పునరుద్ధరణమును జాతీయవిద్యయు ముఖ్యసాధనమని వచించెను. 1907 లో పాలు తిలకు మొదలగువా రాసిద్ధాంతములను దేశమందు ప్రచారము చేసిరి. అపుడు జవహారాంగ్ల దేశమునసుండినను సంగతులనెల్లను వార్తాపత్రికలయందు చదివియు నింగ్లండునకు వచ్చు భారతీయనాయకుల యుపన్యాసములను వినియు సంగతులను తెలిసికొనుచుండెను.

హైస్కూలు విద్య రెండేండ్లలో పూర్తిగావించుకొని 1907 అక్టోబరున కేంబ్రిడ్జిలోని ట్రినిటీ కళాశాలలో విద్యార్థిగ ప్రవేశించెను. జవహారునకు బాల్యమున కలిగిన ప్రకృతిశాస్త్రాభిరుచి యిచట వృద్ధియైనది. నూతనవిజ్ఞానముగ నేర్పడిన వాయువిమాన పద్ధతులనుగూడ నతఁ డుత్సాహముతో పరిశీలింప గడగెను. కేంబ్రిడ్జిలో రసాయన శాస్త్రము, భూతత్వశాస్త్రము, వృక్షశాస్త్రము, అభిమానవిద్యలుగ నతడు నేర్చుకొని న్యాచురల్ సైన్సునందు 1910 సం॥రమున ట్రైపసు పరీక్షనిచ్చి ఎం. ఏ. బిరుదమును పొందెను. మంచి తెలివితేటలుగలవారికే

కేంబ్రిడ్జియం దాబిరుదములభించును. ఇప్పటి పండితబిరుద మాత నికి లభించుటకు పై విషయములన్నియు నాతనికి తోడ్పడెను.

జవహరులాలు మంచి మేధావి. ఏపరీక్షకును విశేష శ్రమ మవసరములేకుండగనే ప్రతివిషయమునను జ్ఞానసంపాద నను చేయగలిగెను ముఖ్యముగ చెప్పదగిన గొప్పమాట యొ కటి గలదేమనిన ధనమునకు లోటులేనపుడు వ్యసనములకెల్లను కేంద్రస్థానమగు నింగ్లండున కొంటరిగ నుండియు వ్యసనము లకు లోబడక శీలమును పాడుచేసుకొనక కాపాడునుటయే యాతని గొప్పతనమును వేనోళ్ళ చాటగలదు. ఆతఁడు తనకాల మును సద్వినియోగ పరచుటయే కాక స్కూలు చదువుతో తృప్తిచెందక ఆంగ్లభాషాగ్రంథములను మిగుల శ్రద్ధతో చదివి జ్ఞానసంపాదనను గావించుకొనెను. రాజ్యాంగతత్వమును గూర్చి యు భారతీయుల విషయములనుగూర్చియు చాలగ్రంథములను చదివి సంతులను గ్రహించెను. సోషలిజమును సాంఘిక వాదపు మూలసూత్రములనుగూడ చదివి పాలు, గోఖేలు, గజ పతిరాయి మొదలగువా రింగ్లండు వచ్చినపుడిచ్చిన యుపన్యాస ముల నతిశ్రద్ధతో విని యుత్సాహపడువాడు.

పట్టపరీక్షలో తేరిన వెనుక మోతీలాలుగా రతనిని, ఐ. సి. యస్. పరీక్షను చదివింప తలంచిరి. తన కొడుకు కలక్టరై ప్రభుత్వపు టుద్యోగముజేసి ధనవంతుడగునను తలంపు నర్కారు నౌకరీయనిన, జవహరున కసహ్యము. యుద్యోగిగనుండిన నల

పోనునసనే యుండక బదలీయైన దూరదేశములకు పోవలెను. ఏకపుత్రుడు తనకు దూరముగ పోవుట కతనికిష్టములేదు. జవహారు తనతండ్రి పెదతండ్రులవలెనే న్యాయవాదిగ నుండుటకె నిశ్చయించుకొనెను.

బారిష్టరు పరీక్షను చదువుటకు జవహారు లండనులోని ఇన్నరు టెంపులులో విద్యార్థిగజేరెను. గాంధిగారివలె నీతడును కన్యలవద్దను యువతులవద్దను మిగుల బిడియముగ మెలగుచు పాశ్చాత్యసంఘపు టలవాటులకు లోనుగాక తన సహజ వ్యక్తిత్వమును కాపాడుకొనుచు నింగ్లండున విద్యార్థులై యుండిన డా. ఖానుసాహేబు, డా. కిచులూ, సేనుగుప్త, సైయ్యదు మహమ్మదు, షేర్వానీయుద్యోగిగానున్న అన్సారీ గారితోను మిగుల సఖ్యతగ నుండుటయేగాక భారతదేశమున కాంగ్రెసు కార్యరంగమున కార్యములను జరుపుటలో గూడ పైవారు చాల మిత్రులుగ నుండిరి. ఇంగ్లండున తానున్న రోజులలో ప్రచారమునకు వచ్చిన సాంఘికవాద పద్ధతులను గూడ జవహరు చదివి బాగుగ గ్రహించెను. జాతీయభారము లను, విషయపరిజ్ఞానమును, లోకానుభవమును నభివృద్ధి జేసి కొనుచునే జవహరు బారిష్టరు పరీక్షలోజేరి 1912 లో స్వదేశ మునకు మరలివచ్చెను.

జవహారు ప్రతిసారియు పరీక్షయందు త్తీర్ణు డగుచునే వచ్చెనుగాని యెప్పుడు తప్పిపోవుట యను మాటయే లేకుండ పైకి రాగలగెననుట యాతని తెలివితేటలకు నిదర్శనము.

ఆంగ్లదేశ నివాసమున గలిగిన విద్యాభ్యాసమునకు తోడు నచట విజ్ఞానమును విశాల స్వాతంత్ర్య భావములను స్వాయం వ్యక్తిత్వమును వృద్ధినొందించు కొనెను.

## 3. న్యాయవాది దశ.

విద్యాభ్యాసము పూర్తియై భారతదేశమునకు వచ్చిన వెనుక జవహరులాలు అలహాబాదులో తండ్రితోపాటు హైకోర్టు వకీలుగజేరి పనిచేయు నారంభించెను. మోతీలాలుగారచట వకీళ్ళలో లీడింగు వకీలనిపేరు గాంచియుండిరి. అందుచేతను పైగా స్వతహా తెలివిగలవాడగుటచేతను, జవహరునకు న్యాయవాదమున చేతినిండ పని వెతకికొను నవసరములేకుండ నమరియున్నది. గొప్ప వర్తకులు, జమీందారులు, రయితులు మొదలగు నన్నిరకములు వారి కేసులు తెరపిలేకుండ నుండుటచే జవహరులాలు తండ్రికి సహాయముగ నెనిమిదేండ్లుపాటు పని చేయుచున్నపుడే హైకోర్టు కేసులను కొన్నిటిని స్వతంత్రముగ నాతడు నడిపి గెలిపించెను. సహృదయుడును నిరంతర కార్య తత్పరుడును ప్రజ్ఞావంతుడునగు జవహరు మరికొంత కాలమా వృత్తిలో పనిచేసియుండినచో అచట న్యాయవాదులలో నుత్తముడని ప్రఖ్యాతి సంపాదించుటయే గాక అమిత ధనము గడింప గలగడాయని తోచును. ఆతని తండ్రి యాశయము నదియేకాని జవహరుని కావృత్తియందభిలాషయు,నాసక్తియు

లేకుండెను. ద్రవ్యమార్జించు తలంపులేదు. ఆతని మనమున బాల్యమం దంకురించిన జాతీయబీజము కొనసాగి క్రమముగ బలపడి వృక్షమై దేశసేవాసక్తిగ పరిణమించి సకలజన నదుపాయ కార్యముల వంకకే మరలించెను. ఆతని చిత్తమున మన దేశీయు లనేకయిక్కట్టులకులోనై సహింపరాని పలువిధములగు బాధలపడుచుండిరే మెటులీ యవస్థనుండి తప్పి బయటపడి సుఖింపగలుగుదురను తలంపు బలమైనది. దీనిబాపుటకు వకీలు వృత్తి సాయపడజాలదు. పట్టుదలతో సంఘసేవకై పాటుపడు ప్రబుద్ధులు పలువురు కావలసియున్నారు. అట్టివారు మునివ్రేళ్ళపై లెక్కింపదగినవారుగనుండిరి. అందుచే చేతనైనంతవరకు దేశమున కుపయోగించెదనని నిశ్చయించుకొనెను. ప్రతిదేశమునందును ప్రజల యిబ్బందులను బాపుటకు పూనుకొని పని చేయగలుగువారు లాయరులయియుండి రాజ్యాంగ రంగమున పాటుబడుటగలదు. రాజకీయమున పాల్గొని నాయకులుగను పాలకవర్గముగను సభ్యులుగను నిలిచి సాహసముగ పనిచేయ గలుగుటకు లాయరులకు గాక మరియొవరికి వీలగును. దేశమునందును రాజ్యాంగ పరిస్థితుల నెదుర్కొన కాంగ్రెసు సంస్థను నెలకొల్పి దేశక్షేమమునకై పాటుబడు చున్నవారు వకీళ్ళుగనే యుండిరి వారును సర్వస్వమును దేశము బాగునకై పరిత్యజించి పనిచేయ బూనక తీరికగలిగినపుడే రాజకీయమున పాల్గొనుచుండిరి. అట్టివారు పలువురు మితవాదులు అట్టిదేశ సేవ మనదేశమున కుపకారి కాజాలదని జవహరు తప్పనిసరియై

నపుడే తన వృత్తి నవలంబించుచు మిగతకాలము ను సాంఘిక రాజకీయములలో పాల్గొనుటకును జాతీయకార్యములకొరకు నుపయోగించి పనిచేయుటకును వినియోగింప దలంచెను. స్వదేశమునకు వచ్చిన 1912 వత్సరమున బంకీపూరున జరిగిన కాంగ్రెసుకు జవహరులాలు వెళ్ళెను.

1907 లో సూరతులో జరిగిన వేరుపాటుచేత మితవాదులు కాంగ్రెసులో కొన్ని నియమముల చేర్పరచిరి. అందుచే జాతీయవాదుల నచటస్థానము లేకుండపోయినది. గోకేలుగారి నాయకత్వమున మితవాదులెల్ల రంగుచేర కాంగ్రెసు సాలీనాలో తీర్మానముల చేయుచుండిరి ఆచేతలు నట్టి వినోదములైనవి. ప్రభుత్వమునకు ప్రజలకోరికలను ప్రార్థనల రూపమున తెలియబరచుచుండినను, ప్రభుత్వము వారెవరును వాటిని గణించియుండలేదు. కాంగ్రెసుతోపాటు సాంఘికసభ, ఆస్తికసభ, వ్యాపారసభ మొదలగు కొన్ని యితర సభలును క్రిస్మసు వారమందే వేగముగ మొక్కుబడి విధముగ నాంగ్లభాషనే జరుపబడుచుండెను. మరియొకటి సంవత్సరము వరకు నడుమ నేపనియు జరిగింపబడుటలేదు జిల్లాలో కార్యము నడుపు సంఘములును లేవు.

ఆవిధానము దేశమున కుపయోగకారి కాదని జవహరు తలంచి సాలుపొడుగునను సామాన్యప్రజల కుపయోగకరముగ జరుపదగు కార్యక్రమమును కనుగొనుచుండెను. ఈ సమయమున మోతీలాలు గారు మితవాదులతోపాటు సంవత్సర సమావేశసమయమున నటకు వచ్చుటకలదు. ఆయనకది యొకవేడు

కగనుండెను. ఆతని తనయుడుమాత్రము వీలు చిక్కినపుడెల్లను జాతీయ ప్రచారమునకు పూనుకొనుచుండెడివాడు.

ఆసమయమున బ్రిటిషుసామ్రాజ్యమందలి దక్షిణాఫ్రికాలోని భారతీయుల నచటి యూరపియనులు చాల హీనముగ చూడగడంగిరి. ఆస్థితి వినుటకే సహింపవీలుగానిదిగ నుండెను. మనవారిచ్చు పిటిషనుల యుపయోగము లేకపోయెను. ఇంగ్లండు ప్రభుత్వమువారు మనవారి మొరవిని దానిని సవరింపలేదు. ఆబాధవలన నచటి భారతీయులు గాంధిగారి నాయకత్వము క్రింద సత్యాగ్రహము నడుపుచుండిరి. అందుల కధికముగు ద్రవ్యము కావలసియుండెను. అందులకుగాను సానుభూతితో సంగతిని ప్రచారముచేసి చాలచోట్ల తిరిగి సుమారేబదివేల రూపాయలను జనహారులాలు వసూలుచేసి సత్యాగ్రహులు సహాయమునకుగాను దక్షిణాఫ్రికాకు పంపుటకు గోఖేలుగారి కిచ్చెను. ఆసత్యాగ్రహము జయమందినది. దక్షిణాఫ్రికా ప్రభుత్వము భారతీయులతో నొకవిధముగ రాజీకి వచ్చిరి. 1914 లో గాంధిగా రచటినుండి మనదేశమునకు మరలివచ్చిరి.

అంతలో యూరపుమహాయుద్ధమారంభమై లోకమును నిండ బ్రిటిషువారికి భారతీయుల సహాయ మవసరమైనది. ఆ సమయమున బ్రిటిషుప్రభుత్వమువారి నెట్టిమరతులను కోరకుండగనే మనము యీక్లిష్టసమయమును వారికి సహాయము చేయదగునని మితవాదులును గాంధిగారును పలుక తిలక్

మొదలగు జాతీయవాదులది సరికాదని నుడివిరి. అప్పుడు మన యార్థికస్థితి బాగుగలేదు. మన ప్రభుత్వమువారును మనలోని ధనికులును తక్కినవారును తమ బాగోగులను మరచి యాకిష్ట సమయమున నాంగ్ల ప్రభుత్వమునకు సేవ రూపకముగను ధన రూపముగను వైద్యరూపముగను బ్రిటిషువారి కమితసహాయ మును చేసిరి. ఆయుద్ధమున జర్మను లోడిరి. బ్రిటిషువారి మిత్రి మండలి గెలుపొందినది. మనదేశస్థులు చేసిన సహాయమునకు ప్రతిఫలముగ మన ప్రజల బాధలు చాల హెచ్చినవి. ప్రభుత్వ మువారు తీవ్రశాసనములను బెట్టి యనేకులను నిర్బంధమున నుంచి బాధించిరి. వాడుక వస్తువులధరలు పెరిగెను. పన్నుల బరు వధికమయ్యెను. బీదల జీవితము దుర్భరమయ్యెను. ప్రపం చమునందంతటను స్వయం నిర్ణయాధికారము స్థిరపరుచుటకే ఆయుద్ధమును జరుపుచుంటిమి మరియు భారతీయులను మనః పూర్వకముగ సాయము చేయవలెనని యుద్ధసమయమున బ్రిటిషు నీతకోవిదులును పాలకులును ప్రేరేపణలను చేసిరి.

బ్రిటిషువారి వాక్యములను వినిన విదేశీయులును భార తీయులకు దేశమును స్వపరిపాలన లేకుండ జేయుట, కేవల మన్యాయమని యధిక్షేపించిరి. 1916 లో శ్రీగంగాధరతిలకు గారు పూనాలో హోమురూలులీగును స్థాపించిరి వెంటనే బిసెంటుగారొక హోమురూలులీగు నెలకొల్పిరి. ఈ రెండును జాతీయస్వాతంత్రియము నెలకొల్ప తీవ్రప్రచారమును సాగిం

చెను. వెంటనే జవహరులా లీరెంటిలోను సభ్యుడై చాల పట్టు దలతో పాటుపడుచు జాతీయభావములను ప్రజలలో వ్యాపింప జేసెను. తరువాత నతఁడు బీసెంటుగారి భారతీయహోము రూలు లీగునకు కార్యదర్శిగ గూడ పనిచేసెను. మోతీలాలు గారును అలహాబాదు హోమురూలు లీగున కధ్యక్షుడుగ నుండెను. హిందూమహమ్మదీయుల మధ్యసామరస్య మేర్పడి యుభయులును కార్యక్రమమున పాల్గొనినగాని కాంగ్రెసులో పాల్గొనుట కాయన కిష్టము లేకుండెను.

ఈస్థితిలో అలహాబాదున మోతీలాలుగారి యానంద భవనమున అఖలభారత కాంగ్రెసుకమిటీవారును, అఖలభారత ముసిలింలీగు కమిటీవారును సమావేశమై తమతమ భేదముల నొకరీతిగా సరిపుచ్చుకొనిరి.

ఆ సాలాఖరున లక్నోలో జరిగిన కాంగ్రెసు సభలో నా యొడంబడిక ఖాయమగుటయేగాక తిలకు మొదలగుజాతీయ పక్షవాదులు నందు పాల్గొనిరి. రెండు పక్షములవారికి సఖ్యత కలుగగనే దేశమం దుద్యమమునకు బలము హెచ్చినది. ఈలోగ బీసెంటుగారు అరెస్టయిరి. దేశమున నాందోళన హెచ్చినది. 1917 లో బ్రిటిషుప్రభుత్వమువారు యుద్ధానంతర మున భారతదేశమునకు బాధ్యతాయుతరాజ్యాంగము లప్పక నొసగుదుమని పలికిరి. కాని దేశమున నిరంతరశ పాలనముసే

చేయుగడంగిరి. తన తండ్రిని జాతీయోద్యమములో పూని పని చేయునట్లు చేయుటకు జవహరు యత్నించుచుండెను. తిలకు గారు ప్రయాగలో తనతో మాట్లాడినపుడు తన తండ్రితో నాయనను మాటలాడించెను. ఆమాటలు వినినవెనుక మోతీలాలుగారు మతవాదుల ప్రార్థనాపద్ధతి యనుమానకరమయినదని తలంచెను. జాతీయవాదుల కయినను ఆందోళన తప్ప సరియైన నిర్మాణకార్యక్రమ మేర్పడలేదని తాను స్వతంత్రముగ సరియగు కార్యక్రమమునుగూర్చి యాలోచింపగడంగెను.

1916 లో జవహరులాలునకు ఢిల్లీనగరనివాసి యగు భూస్వామి జవహరులాలు కౌలను కాశ్మీర బ్రాహ్మణుని కొమార్తె కమలనిచ్చి పెండ్లిచేసిరి. ఆవధువు మంచి రూపవతి చదువుకొన్నది. భర్తభావముల కనుగుణముగ నడచుకొనుచు దేశభక్తికలదై జాతీయోద్యమమునకు భర్తను ప్రోత్సహించుచు తానుగూడ పనిలో తోడ్పాటుగ నుండెను. వివాహమయిన వెనుక భార్యతో స్వదేశమగు కాశ్మీరమున కేగెను. అపుడ మరనాథగుహను చూడబోయినపుడచటి మంచుగడ్డలు జారి క్రింది లోయవైపునకు జవహరులాలు జారి పడెను. దైవవశమున ప్రమాదము కలుగకుండగనే కొంతదూరములో పట్టు దొరికినందున ప్రాణాపాయము కలుగలేదు. త్రాళ్ళ సహాయమున వయిటికి రాగలిగెను.

## 4. స్వతంత్రత.

1918 లో ప్రపంచ యుద్ధము ముగిసినది. ప్రతిదేశపు పాలనా విధానమును దేశప్రజల యిష్టప్రకారమే జరుగవలె నను పద్ధతియే ప్రపంచమందంతటను సాగించెదనని యూరపు లోను ముఖ్యముగ బ్రిటిషు పరిపాలనా దేశములలోను స్వయం నిర్ణయసూత్రముపై రాజ్యాంగమును నడిపెదమని రాజ్యాంగ నాయకులును ప్రభుత్వాధికారులును యుద్ధ సమయమున చాటి యుండిరి. భారతదేశమున ప్రజలకిష్టమగు పద్ధతిని యుద్ధానంత రము రాజ్యాంగము సాగించెదమని 1917 ప్రభుత్వము వారు తెలిపినపుడు దేశమున యశాంతి తగ్గినది. ప్రజలకాశ జనించి నది. స్వయంనిర్ణయపద్ధతికి ప్రజలెదురు చూచుచుండిరి. ప్రభు త్వమువారు భారతదేశమున కొసగెదమనిన వరములకు గాను మాంటేగు, చెంస్ఫర్డు సంస్కరణలను 1918 సం॥రం చివరకు ప్రవేశపెట్టిరి. అవి దేశీయులకు స్వతంత్రము స్వేచ్ఛ నిజమగు నధికారము నిచ్చునవికావు. వాటిని చూచి జాతీయనాయ కులకేగాక సామాన్యజనులకు గూడ నాశాభంగము కలిగి నది. ఆసాలుననే జరిగిన కాంగ్రెసున ప్రభుత్వసంస్కరణ లోప ముతోకూడినదని యేకగ్రీవముగ నిరసింపఁ బడినది. మితవాది నాయకులు వారివ్వదలచిన యుద్యోగములకు భ్రమపడ దొడ గిరి. మోతీలాలుగారికి కూడ సందేహము కలిగినది. తన తన యుని పద్ధతిజాతీయపక్షము నంటియున్నది. మితవాదుల కోరిక

లును ప్రభుత్వ చర్యయు నిరాశను గలిగించుచున్నవి. భారతీయుల కలవడు లాభము కనుపడదు. అందుకు కాంగ్రెసు ప్రతినిధులు తల్లడ పాటుతోనుండిరి. 1918 సాంవత్సరమున రాష్ట్రీయ కాంగ్రెసు సభ లక్నోపురమున జరిగినది. ఆసభకు మోతీలాలు నెహ్రూగారే యధ్యక్షులు. అంతవరకు కాంగ్రెసును నడుపుచుండిన నమితవాదులు సభలో చర్చలు నాకుకు వ్యతిరేకముగ నుండుటచే సభకు రా మానుకొనిరి విలుగ జాతీయోద్యమమును సాగించెదమని బడాయికొట్టి నమితవాదులా సభకు రాకుండుట మోతీలాలుగారికి వెగటుగ దోచినది. జాతీయవాదులే యాసభను జయప్రదముగ నడపిరి. అందు మోతీలాలుగారి అధ్యక్షోపన్యాసమునకును నిర్వాహణమునకును సభకు లెల్లరును సంతోషమును పొందిరి.

1919 లో నెహ్రూ లిరువురును కలిసి పత్రిక నొకదానిని నెలకొలిపి జాతీయభావయులను ప్రజలలో వ్యాపింప జేసినగాని రాజకీయ పరిజ్ఞానము కలుగదని నిశ్చయించి అందులకు దేశీయులెల్లరు చదువదగిన భాష యాంగ్లమేయని నిశ్చయించి 'ఇండిపెండెంటు'ను పేర నాంగ్లదిన పత్రికను స్థాపించిరి. అది లిమిటెడుకంపెనీ దైనను మోతీలాలుగారి ధనసహాయ మాధారముగాని జవహరులాలు డైరక్టరు లో నొకడై తరుచు పత్రికలోని వ్యాసములను చక్కగ ప్రబోధము కలుగునటుల తీవ్రముగ వ్రాయగడగుటయేగాక దేశీయ సమస్యలను చక్కగ చర్చించుచు జాతీయ భావములను వివిధ విషయము

లను వ్రాసి పత్రికకు మంచి ప్రచారమును గలిగించెను. మిత వాదుల భావములను తీవ్రముగ విమర్శించుచు వ్రాయుటయే గాక పత్రికా నిర్వహణమునకు తగిన సంపాదకుని వెదకుచు సి. యస్. రంగయ్యగారిని పత్రికకు సంపాదకునిగ నియమించెను. ఇండిపెండెంటు పత్రిక అల్పకాలముననే జాతీయ పత్రికలలో ప్రధానమైనదై దేశముననేగాక అన్యదేశములలోను వ్యాపకమును బొంది అలరారినవి. దేశీయులను మేల్కొలిపి సంఘభావమునకు తోడు పాటును గలిగించినది. ప్రభుత్వము వారందలి ప్రధానవ్యాసము రాజద్రోహముగ నున్నదని జవహరుపైనను రంగయ్యరుపైనను కేసుపెట్టిరి. ఆవ్యాసము సంపాదకుడైన రంగయ్యదే అగుటచే మేజస్ట్రేటు జవహరును వదలి సంపాదకునకే శిక్ష విధించెను.

ఇండిపెండెంటు పత్రిక 1919 న నారంభింపబడి 1923 వరకు నడుపబడి అసహాయోద్యమ సమయమున చాలదేశసేవ యొనర్చినది. సత్యాగ్రహముతోపాటు పత్రికప్రచారమును తగ్గినది. అదిగాక ప్రభుత్వాటంకముగూడ పత్రికకు కలిగినది. ఇంతకుముందే తండ్రికొడుకు లిరువురును వకీలువృత్తిని మానుకొనిరి. ఇరువురును కారాగారమునకు బోయిరి.

### 5. పంజాబు సమాచారము.

మితవాదుల శాశనోలుపు మాంటేగు షెంస్ఫర్డు సంస్కరణను బట్టియు దేశమునగల తీవ్రవాదుల సణచుటకు తీవ్ర

శాసనములను కల్పించి ప్రభుత్వమువారు 1919 సం॥ ప్రారంభముననే జనులు స్వేచ్ఛకు భంగమునుగూర్చి రౌలెటాక్టును ప్రయోగించిరి భారతీయు లాసించిన స్వరాజ్యము, స్వయంనిర్ణయము మాయమై ఆడంబర సభలును, కొన్నియుద్యోగములను చూపి యాశగొలిపి యందులకు విద్యావంతులలో విద్యావంతులకు పోటీలు కల్పించి ఐకమత్యమును పాడుచేసియు ప్రభుత్వపుఖర్చు హెచ్చుటవలనప్రజలపై పన్నులబరువునుమోపియు వంచగడంగిరి. దానితో మితవాదులతోగూడి ప్రభుత్వమునకు కష్టకాలమున సాయము నలిపిన గాంధిగారికి మనను మారిపోయెను. ప్రభుత్వమువారు మనకుమేలుచేయరనితోచెను.

మన పాలకవర్గమునకును ఇంగ్లండులోని సామ్రాజ్య ప్రభుత్వమునకును భారతీయులపై సానుభూతి హృదయపూర్వకమైనదికాదనియు, స్వరాజ్యము బిటిషువారి కృపచే రాజాలదనియు, భారతీయుల యోగ్యతో నుండిన స్వయంకృషి వలననే యది లభ్యము కాదగినదనియు నప్పు డున్న పరిస్థితి ననుసరించి గాంధిగారు నిశ్చయపరచికొని దాని సాధనకు పూనుకొనిరి. వెంటనే రౌలెటుశాసనమును తీసివేయించుటకై అహింసా పూర్వకముగ దాని నిబంధనలకు లోబడకుండుటకై దక్షిణాఫ్రికాలోవలె జయిలునకు పోవ తయారగు వారిని చూచుకొని గాంధిగారు వెంటనే సత్యాగ్రహమును ప్రారంభించి దాని ప్రచారమునకై దేశమున హారతాల్ జరగించిరి. ఏదయిన కార్యకారియగు సూత్రమునకై వేచియున్న జవ

వారులాలు వెంటనే యీసంఘమున చేరజూచెను. కాని మోతీలాలుగా రందు కంగీకరింపలేదు. అపుడు గాంధిగారు నెమ్మదిమాటలతో వేరువేరుగ మాటలాడి తొందరపడవద్దని జవ హారు నప్పటికి యూపుచేసెను. ఇంతలో ఏప్రియలు 13 వ తేదీని పంజాబులోని యమృతసరు పురమధ్యమునగల జలియను వాలాబాగు అను తోటలో మామూలు ప్రచారసభ శాంత ముగ జరుగుచుండెను. ప్రభుత్వసేనాని హఠాత్తుగ పటాలమును వెంటబెట్టుకొని వచ్చి సైనికులచే నిరాయుధులగు సభవారిపై మరఫిరంగులను ప్రేల్పించెను. ప్రజలు తప్పుకొనిపోవ వీలులేక వందలకొలది గుండ్లకు గురియై చనిపోయిరి. పంజాబు నందంత టను ప్రభుత్వమువారు సైనికశాసనములను పెట్టి యేప్రాంతము వారిని గాంధి మాలవ్య మున్నగు వారినిగూడ పంజాబులోనికి రానీయరైరి. పంజాబులో ప్రభుత్వోద్యోగులు కఠిన వర్తనతో నుండిరని తక్కిన ప్రదేశములకు వదంతులు రాసాగినవి. యుద్ధ సమయమున పంజాబుప్రజలే సేనలలో చేరి దొరతనమువారికి సాయపడిరి. అట్టివారికే చివరకిట్టి దురవస్థ కలిగినందులకు దేశమంతట నాందోళనము చెలరేగి ప్రభుత్వముపై ద్వేషభావము కలిగినది, అదికని గాంధిగారు అహింసాపద్ధతిపై సహాయనిరో ద్యమ మను సిద్ధాంతమును బోధింపసాగిరి. పంజాబున నల్లరి జరిగిన కొన్ని నెలల తరువాత సైనికశాసనమచట తీసివేయ బడినది. ఇతర ప్రాంతములవారు పంజాబు పోవ నవకాశము కలిగినది. ప్రభుత్వమువారి విపరీతకార్యముల కిచటి ప్రజల

భయపడిపోయిరి. ఆ యొడిదుడుకునకు తమబాధ్యత లేదని ప్రజలు చెడునడత నడచి శాంతి నెలకొలుపుటకే ప్రభుత్వము వారు కఠిన చర్యను పూని యనవసరముగు శాసనమును గావించి రనియు ప్రభుత్వమువారు ప్రకటించిరి. అది నిజముకాదని దేశమున గోలపెట్టిరి. ప్రభుత్వ నిషేధ పరిమితి గడువగనే నిజస్థితిని విచారించుటకు కాంగ్రెసు వారొక కమిటీని నియమించిరి. ఆ కమిటీలో చిత్తరంజనదాసు మోతీలాలు నెహ్రూరు, గాంధిగారును మరికొందరు న్యాయవాదులు సభ్యులుగ నేర్పరుపబడిరి. వారు న్యాయమగు విచారణను సలుపబూని ప్రభుత్వోద్యోగులతోడు పాటును గూడ కోరిరి. గాని యుద్యోగు లెవరు విచారణలో పాలుగొనలేదు. అదిగని ప్రజలు బహిరంగముగా నా విచారణలో సాక్ష్య మిచ్చుటకు భయపడిరి. సాక్ష్యమిచ్చినయెడల ప్రభుత్వముచే నేమి కీడు మూడునోయని భీతిలిరి. ప్రజలకు ధైర్యముచెప్పి సాక్ష్యవిచారణకు తగు నేర్పాటులుచేసి విచారణ జరిగింప జవహరులాలు గారిని కాంగ్రెసువారు నియమించిరి. అతడు కమిటి విచారణ న్యాయముగ జరుగుటకు చాలకాలము పాటుపడి దాసుగారికి యండగనుండి పనిచేసిరి. మోతీలాలుగారు కాంగ్రెసు నియామకమున నావిచారణలో మనస్ఫూర్తిగ పాల్గొనిరి. ఉద్యోగుల కఠినచర్యలావిచారణలో బయలుపడుచుండ మోతీలాలుగారికవి చాల కష్టముగ కనుబడినవి. అప్పుడు దాసు మోతీలాలుగార్లప్పటినుండియు ప్రాణమిత్రులైరి. విచారణ ముగిసి ప్రభుత్వ

పద్ధతి తెలియబడగనే మోతీలాలుగారి మనోసందిగ్ధత తొలగినది. ఉద్యోగులు ప్రజలపై మోపిన నిందలు కేవలం నిరాధారము లని కారణము లేకుండనే యుద్యోగులను సైనికులును ప్రజల నష్ట కష్టముల పాలుజేసిరని ఈకమిటీవారు తమరిపోర్టులో నిర్ణ యించిరి. 1919 సాలాఖరున కాంగ్రెసుసభ అమృతసరు పట్ట ణముననే సమావేశమైనది. దానికి మోతీలాలు నెహ్రూగారే యగ్రాసనాధిపత్యము వహించెను. పంజాబు సంగతులా కాం గ్రెసుసభలో చర్చింపబడి యుద్యోగుల చర్యలు తీవ్రముగ ఖండింపబడినవి. మోతీలాలుగారు మితవాది నాయకులను బిలచి సంగతి తెలుపదలచినను వారు కాంగ్రెసు సభకే రా కుండ బహిష్కరించిరి. జవహరులాలుగా రప్పటినుండి ప్రతి కాంగ్రెసు సమావేశమునకును తప్పకవచ్చి పాల్గొనుట జరుగు చుండెను.

మోతీలాలుగారు తమ యభిప్రాయము నానాటినుండి పూర్తిగ మార్చుకొనిరి. తండ్రిగారికి జవహరున తీవ్రపద్ధతుల పైనుండిన వ్యతిరేకభావ మానాటినుండి సడలినది. నెహ్రూ లిరువురును తమ జీవితమును, ఆస్తిని, శక్తిని, జాతీయసే వకే వినియోగించుటకు నిశ్చయించుకొనిరి. మోతీలాలుగారు నాటినుండి పాశ్చాత్యవస్తు ప్రియత్వమును విడనాడిరి. విదేశ వస్త్రధారణను మద్యపానపుటలవాటులను మానుకొని దేశీయ వేషభాషల నవలంబించిరి. అప్పటినుండి తమ యుపన్యాసము లను హిందీయందే యారంభించిరి.

## 6. అసహాయోద్యమారంభము

1920 లో గాంధీగారు 'నాన్‌కోఆపరేషను' సహకార నిరాకరణము చేయవలెననిరి. అనగ ప్రభుత్వమువారు తమ యధికార ప్రాబల్యమునకై చేయుపనులలోను వారికేవిధమగు సహాయమును సలుపరాదని జరుపు సంస్థలలోను పాల్గొనరాదని దానిభావము. ఆసాలున సెప్టెంబరులో కలకత్తా కాంగ్రెసున గాంధీగారు పెట్టిన యీతీర్మానమును మోతీలాలుగారు బలపరచిరి. నాగపురమున జరిగిన కాంగ్రెసులోను సహాయ నిరాకరణ చేయవలెనని సభ్యులచే నామోదింపఁబడినది. ఆయామోదము నెగ్గినవెంటనే నెహ్రూలిద్దరు న్యాయవాద వృత్తిని పూర్తిగ మానివేసిరి. మోతీలాలుగారికిని జవహరులాలుగారికిని కలసి సాలునకు లక్షలకొలది ఆధాయము వచ్చెడిది. తాము వృత్తిమూసిన నాటనుండియు కర్చు తగ్గించుకొనిరి. జవహారు తనయావచ్ఛక్తిని జాతీయ కార్యముల కొరకే వినియోగించుచు సత్యాగ్రహసమరమున నడుగిడెను. అంతట కుటుంబమంతయు నతడు నడచిన మార్గమున నడువఁ బూనిరి. సంయుక్తరాష్ట్రమున కాంగ్రెసు సంస్థ జనాదరణను పొందుటకు నెహ్రూల తోడ్పాటె ముఖ్యకారణము. జవహారు చిన్ననాట నుండి చల్లనిదగు నింగ్లండున నుండిన యలవాటున వేసవిలో కొండప్రాంతములకు పోవుట కలదు. 1920 వ సంవత్సరమున

జవహరు వేసవిని తల్లి భార్య జబ్బుగానుండుటచే వారితో హిమాలయ సమీపమునగల ముస్సోరి యను పురమున నివసించిరి. అపుడచటికి ఆఫ్ఘను ప్రభుత్వపు రాయబారులు బ్రిటిషు ప్రభుత్వము వారితో రాజీ సంభాషణకై వచ్చి నెహూరులుండిన హోటలునందుండిరి. రాయబారులతో జవహరు మాటలాడిన బ్రిటిషు రాజకీయములకాటంక మేదేని కలుగునని యనుమానపడి మద్రప్రభుత్వమువారు జవహరు నటనుండి యెటకేని వేగముగ పొమ్మని తెలియపరచిరి.

అందు జవహరు కుటుంబమునువిడిచి ప్రయాగ పోయెను. అప్పటికి శాసనధిక్కార మారంభించలేదు. అయోధ్యపరిసరపు రైతులు జమీనుదారులు తమను బాధించుసంగతులు నార్ధికపు చిక్కులు చెప్పుకొనుట కలహాబాదునకు వచ్చి మొరబెట్టుకొనిరి. ఏపనియును లేక విశ్రాంతిగనుండిన జవహరు వెంటనే వారితో చని అయోధ్యలోని రాయబరేలీ మొదలగు జిల్లా రైతులతో దిగిరి. వారు పడు పాట్లను స్వయముగ జూచెను. ముస్సోరినుండి ప్రభుత్వపు నిషేధముచే యలహాబాదునుండి రైతుల యిక్కట్టులను జూచి యాజిల్లాలో తిరిగి రైతులసభలయందుపన్యసించుచు జాతీయభావములను వారికి బాగుగ బోధించెను. ఆనాటినుండి జవహరు కష్టసుఖములను సరకుగొనక పొలములవెంట మైళ్ళకొలది కాలినడకనుపోవుచు వారికి సలహాలను చెప్పుచు సామాన్యులపట్ల దయగలవాడై కార్మిక

కర్షకుల నుద్ధరించుట తన జాతీయోద్యమమునకు సాధనముగ యాందోళననిర్ణయించుకొనెను. ఇపుడతఁడు రైతులలో కలిగించిన ఫలితముగ వారిలో నైకమత్య మేర్పడి తమ హక్కులకుగాను బాగుగ నాందోళనము నలుపసాగిరి. సంయుక్తప్రాంత మంతటను జమీందారి పద్ధతి యమలునందున్నది. అప్పటి కయోధ్య రైతులకిచ్చుటవలె జిరాయితీహక్కులు లేవు. జమీందారిష్టము వచ్చినట్లు రైతుల తొలగించవచ్చును. మితిలేని పన్నులను వసూలు చేయుట గలదు. జవహారులాలు నాయకత్వమున జరిగిన ప్రబోధమువలన వారు చెలరేగి భూముల యావజ్జీవపు హక్కులను, జమీందారీపన్నుల యొత్తిడి రక్షణము పొందగలిగిరి. రైతులకు కొంతమేలు సమకూరినది. జవహరప్పటికింకను సాంఘికవాది కాలేదు. కేవల జాతీయవాదిగనే యుండెను. పనిచేసిన యనుభవమువలన ధనవంతులగు భూమందులకు, నిరుపేదలగు రైతులకు కలుగు యార్థిక యొడిదుడుకులును, అందుచే సంఘమునకు కలుగు హానియు నాసూక్ష్మగ్రహికి వెంటనే తెలియవచ్చెను. తాను బాల్యమున చదివిన సాంఘికవాద సిద్ధాంత మీదేశమున నిదర్శనముగ కనుపించెను.

1921 లో దేశమున నశాంతి ప్రబలెను. దాని నణచి రాజభక్తి ప్రజలలో నెలకొల్ప ప్రభుత్వమువారొక పన్నుగడ పన్నిరి. జార్జిచక్రవర్తి తనయుడగు వేల్సు యువరాజును మిగుల వైభవముతో భారతదేశమున సంచారము చేయించి

ప్రజలచే స్వాగతోత్సవములను జేయించి రాజభక్తుని నిలుప జూచిరి. ఆ వేడుకలలో ప్రజలు పాల్గొనునట్లు ప్రోత్సహించిరి. బ్రిటిషురాజకుంబముమీద గాని యాంగ్లేయుల యెడగూడ వ్యక్తిపరమగు ద్వేషము కాంగ్రెసువారి కణుమాత్రము లేదు. కాని సామ్రాజ్యపాలకుల చర్యలయెడను రాజ్యాంగ పాలనా విధానమును ప్రజారంజకముగ లేదని తమ యసమ్మతిని తెలుపుటకై యువరాజసంచారమును బహిష్కరించుటకు కాంగ్రెసువారు ప్రయత్నించిరి. ఆసంచారోత్సవము పాలకు లనుకొనినంతజయప్రదముగ జరుగలేదు.

ఆసమయమున జవహరులాలు మొదలగు నాయకులు కొందరు వాలంటీరు దళములను ప్రోగుచేసి రగినంత యాందోళనమును గావించిరి. అలహాబాదు లక్నో మొదలగు ప్రాంతములలో జవహరు బాగుగపనిచేసి ప్రజలన్ని పనులను మాని యుత్సవములలో పాల్గొనకుండునట్లు చేసెను, ప్రభుత్వమువారు వాలంటీరు దళము లక్రమసంఘములని ముందుగనే ప్రచురించినందున జైలునకు పోవక తప్పదని జవహరు నిశ్చయించుకొనెను. అతనితండ్రికది యిష్టము లేకున్నను జరుగుతంతువలన యుద్యమప్రవాహము మితిమీరినకొలదిని కొమారుని పాల్గొనవలదని నిరోధింపలేకపోయెను. యువరాజు రాకను కొన్నిరోజులు ముందుగనే 1921 డిశంబరున జవహరును మోతీలాలుగారినికూడ పోలీసు లరెస్టుచేసిరి. హరతాలుచేయుమ హెచ్చరించుచు జనులకు కరపత్రములను పంచిపెట్టెనని జవహరుపై కేసుపెట్టబడి

నది. లాపప్రకారమది యప్పటికి నేరముకాదు. వాలంటీరు సంఘముక్రమమైనదని పలికి దానికి సభ్యుడగుట మోతీలాలుపై నేరమును మోపిరి.

అప్పటికాంగ్రెసు నియమప్రకారముగ వారు విచారణలో వాదించలేదు. తమభావములను స్టేటుమెంటున నధికారికి తెలిపిరి. వారుభయులు చెరియారు నెలలు శిక్ష విధంపబడి లక్నో జైలున నుంచబడిరి. ఇది జరిగిననాటనుండి బహిష్కారోత్సాహము మితిమీరినది. వేలకొలది వాలంటీర్లు జైలుననుంచబడిరి. దానితో ప్రజల యుద్రేక మినుమడించినది. యువరాజు పరివారముతో డాపురమున హరతాలు జరుపబడెను. యువరాజు పర్యటనము ముగిసినవెనుక ప్రభుత్వమువారు వాలంటీర్లపైన వేయించిన శిక్షలపద్ధతిని పరిశీలించుట కొకకమిటీ నేర్పరచి కమిటీవారి విచారణలో జవహరుపైన మోపబడిన నేరము ననుసరించి యుతని శిక్ష కవకాశములేదని తేలినది. ఖైదున ౩ నెలలు గడచిన వెనుక ప్రభుత్వమువారు జవహరు విడుదల చేసిరి.

ఆసమయమునసే గాంధిగారు శాసన ధిక్కారమునకుగాను పన్ను లీయకుండ జేయవ్రూనుకొనఁ దలచిరి. కొన్నిచోట్ల తత్వమునకు వ్యతిరేకము జరిగెనని దాని నాపుచేసిరి. సత్యాగ్రహోద్యమ మాగినంతనే గాంధిగారిని ప్రభుత్వమువార రెస్టుచేసి రాజద్రోహపు నేరమున కాయనను శిక్షించిరి. శాసన ధిక్కారమునిల్ప గాంధిగారు నిలుపుచేయుట జవహరు

గారి కెంతమాత్రి మిష్టము లేదు. జవహరు విడుదలైన వెంటనే గాంధిగారితో సంప్రదింప చనెనుగాని అప్పటికే గాంధిగారరెస్టగుటచే జైలున రాజకీయము-లు మాట్లాడ వీలుకలుగ లేదు.

జవహరు గ్రామమునకు తిరిగివచ్చి అచటి సాత్వీక నిరోధము తగ్గిపోకుండ వాలంటీరు సంఘమును బలపరచి వారిలో నుత్సాహము కలిగించెను.

యుద్ధసమయమున విదేశవస్త్రముల దిగుమతి తగ్గినది. ఆ సమయమున మన మిల్లువస్త్రము నేతల బాగుగ పెరిగినది. దానికితోడు గాంధిగారి ప్రోత్సాహమున వడుకునూలుబట్టల వృత్తికియవలంబన కలిగినది. కాని యుద్ధసమాప్తి వెనుక సీమసరుకులు మన దేశమున చౌకగ కిట్టుబాటగునట్లు మనదేశపు నాణెముల విలువను మన ప్రభుత్వమువారు చిత్రముగ మార్చిరి. దానితో విదేశవస్త్రముల ధర విపరీతముగ తగ్గి మనదేశపు బట్టల పరిశ్రమకు చాలనష్టము కలుగజొచ్చెను. ఇది కనిపెట్టి విదేశవస్త్రము లమ్ము దుకాణములచెంత కాంగ్రెసు వాలంటీర్లు పికెటింగు చేయబూనిరి జవహరులాలు తన ప్రాంతమున తీవ్రముగ పికెటింగు సాగించెను. దానితో సీమగుడ్డ లమ్మకము తగ్గినది. నెహ్రూరూలు తమ యింటగల విలువగల వస్త్రముల నన్నింటిని కాంగ్రెసు నియమము ననుసరించి నశింపజేసిరి. అదిగాక కల్లుదుకాణముల చెంత పికెటింగు చేయించుచు మద్యపానము కూడదని ప్రచారము సలిపిరి. దానితో ప్రభుత్వ

మువారికి కల్లుపాటల మొత్తము తగ్గినది. ఆదాయము తగ్గగనే యుద్యోగుల కాగ్రహము కలిగినది. కారణము జవహరని యతనిని అరెస్టుచేసిరి. 1921—1922 లలో వాలంటీర్లు స్త్రీలు వేలకొలధి పికిటింగుచేసి జయిలుకు పోవడంగిరి. జవహరు భార్య సోదరి కూడ పికిటింగుచేసి జయిలునకు వెళ్ళిరి. 1922 న విచారణ జరిపి మేజిస్ట్రేటులున 21 నెలలు శిక్షింపబడి జయిలు నకుపోయెను. జవహరు లక్నో జయిలున రోజుకు 3 గంటల పాటు రాట్నముపైన నూలువడకుచు నవ్వారు నేయుచు తక్కిన సమయములయందు మంచి గ్రంథములను చదువుచు వ్యాయామములలో దేహపరిశ్రమలో గడపుచు బుద్ధి బలమునకు తోడు దేహబలమును కాపాడుకొనెను

దేశమున నడపు నాయకుడు లేక సత్యాగ్రహము చల్లారెను ఆర్యావర్తమందంతటను హిందూ మహమ్మదీయ సంఘర్షణ బ్రాహ్మణ బ్రాహ్మణేతర భేదము బయలుదేరినవి. మితవాదులు సంస్కరణచే లభించు యుద్యోగముల నాసించిరి. కాంగ్రెసునాయకు లగు దాసు మొదలగువారు శాసనసభలలో చేరదలంచిరి. సభలలోనుండియే ప్రభుత్వము నరికట్టజూచిరి. అదియే స్వరాజ్యపార్టీ యనబడెను.

సత్యాగ్రహము తగ్గగనే ప్రభుత్వమువారు రాజకీయ ఖైదీలను 1923 జనవరి యాఖరున విడుదలచేసిరి. అపుడు జవహర్‌లాలు బయటకు వచ్చెను. వచ్చినవెంటనే జవహరు

సత్యాగ్రహకార్యము నవలంబించెను. సంయుక్తప్రాంత కాంగ్రెసున కిప్పుడాతడు కార్యదర్శిగనుండెను. అందుచే జిల్లా కాంగ్రెసు సంస్థలను తిరుగ పనిచేయుగడంగునట్లు చేసెను. కాంగ్రెసులోని కక్షలను సరిచేసి సఖ్యతకలిగించెను. ఇట్లు నిరంతరము పాటుపడి యువకులయందుత్సాహమును పెంపొందజేసి తాను లేకున్నను కార్యము సాగించునట్లు తోడివారిని పురికొల్పి సిద్ధముచేసెను. అపుడు వారి కుటుంబమున కాదాయ మవసరమైనను జవహరు వకీలువృత్తి నవలంబించలేదు. మోతీలాలుగారైనను వృత్తి నవలింబించలేదు. కాని యింటనుండియే పెద్దపెద్దవ్యాపారస్తులు వచ్చినప్పుడు తగుసలహాల నిచ్చుచు నందులకు వారొసగు ధనమును స్వీకరించుచుండిరి. ఈచేంబరు ప్రాక్టీసువల్లనే మంచి ఆదాయము వచ్చెడిది.

విద్యాలోపమునను జమీందారీ పద్ధతిచేతను మనదేశ ప్రజ చాలహీనదశలోనుండిన సంయుక్తప్రాంతమున జవహరు వలన ప్రబోధము కలిగి కాంగ్రెసు సందేశము ప్రజలలో వ్యాపించెను. 1923 సెప్టెంబరు ఢిల్లీలో కాంగ్రెసుసభ సమావేశమైనది. అందుభయపార్టీలకు సమాధానము సలుపను జవహరులాలు చాలపాటుపడెను. అదిగాక సాలాఖరున కాకినాడ కాంగ్రెసుసభలో స్వరాజ్యపక్షమువారు శాసనసభలలో ప్రవేశించుటకు నుభయపార్టీలవారు ఖద్దరు ధరింపను, హిందీవ్యాప్తి చేయను, అంటరానితనమును తొలగించుట మొదలగు కార్య

క్రమము కొనసాగింపను కాంగ్రెసున నందరు నంగీకరించునట్లు జవహరు పాటుబడుటయేగాక అఖిలభారత కాంగ్రెసు కమిటీకి జవహరే ముఖ్యకార్యదర్శిగ నేర్పడెను.

1923 లో శాసనసభ యెన్నికలు జరిగినవి. అంతకు ముందే కాంగ్రెసు దానిని నిషేధించెను. శాసనసభలో మితవాదులు చేరిరి. వారి నీసారి స్వరాజ్యపార్టీవా రీసారోడించిరి. అసెంబ్లీ స్వరాజ్యపార్టీకి మోతీలాలుగారు నాయకుడై ప్రభుత్వ నిరోధమును జయప్రధముగ సాగించెను. అసెంబ్లీలో ప్రభుత్వమువారు పెట్టిన హానికరమగు బిల్లులను సభ్యులెదురుకొని వాటినోడించిరి. అది కనిపెట్టి ప్రభుత్వము వారసెంబ్లీకార్య తంత్రములలో కొన్ని మార్పులను చేసిరి. సభ్యులలోజాతీయవాదులకును మోతీలాలు పక్షమువారికి కలహము కలిగినది. ప్రభుత్వపక్షమువారు తమ కిబ్బందిలేకుండ తమచర్యను సాగించుకొనుచుండిరి. శాసనసభలో చేరుటచే లాభములేదని స్వరాజ్య పక్షమువారికి తెలిసినది. అట్లు తెలియగనే గాంధిగారివలె జవహరును తనదృష్టిని మార్చుకొని జనసామాన్యమునకు రాజకీయ తత్వమును, తెలుపుటకును, దానికి తగిన కార్యక్రమమును తెలియఁ జెప్పుటకును, తనకాలము నప్పటినుండి వినియోగపరచ సాగెను. అవకాశము చూచి దేశసంచారము చేయుచు విద్యార్థులకు యువకులకు విధానములను తెలుపుచు వాలంటీర్ల కధ్యక్షుడుగనుండి వారలకుత్సాహము కార్యదీక్షజనింపజేసెను.

## 7. నాభా విశేషము.

నాభా మనదేశపు పంజాబు రాష్ట్రములోని దేశీయ సంస్థానములలో నొకటి. ఈ దేశపురాజులే సంస్థానమును వంశక్రమముగ పాలించెదరు. మైసూరు బరోడా మొదలగు కొన్ని సంస్థానములలో నొకటి. ఈదేశపురాజులే సంస్థానమును వంశక్రమముగ పాలించెదరు. మైసూరు బరోడా మొదలగు కొన్ని సంస్థానములలో మాత్రము పరిపాలనము కొద్దిగ బాగుండును. తక్కిన దేశీయరాజ్యము లన్నిటిలోను పరిపాలన బాగుగ నుండదు. సరియగు చట్టముండదు. ప్రజలకు వ్యక్తి స్వాతంత్రత నియమము న్యాయవిచారము సరిగనుండవు. సంస్థానాధిపతులిందిృయలోలురు. తమభోగములకై విదేశములలోనో మనదేశపు పెద్దనగరములలోనో యనవసరముగ వేలకొలది రూపాయలను వెచ్చించుచు కాలము గడిపెదరు. జనులనుండి మిక్కుడగు నాదాయమును రాబట్టుటయెగాని వారి దారిద్ర్యమును అనారోగ్యముగాని యజ్ఞానమునుగాని బాపదగు ప్రయత్నములను జేయరు.

పంజాబులోని పాటియాలా రాజ్యాంగము నిట్టిదే. పాటియాలా రాజును తక్కిన రాజులవలె బ్రిటిషు ప్రభుత్వమునకు నాయుద్యోగులకు నత్యంతభక్తుడు. రాజ్యపాలనము సరిగలేకుండినను బ్రిటిషు హక్కులకును తమపద్ధతులకును వీలున్నంత వరకు నారాజ్యపాలన లోపమునకై ప్రభుత్వమువారు సాధారణముగ కల్పించుకొనరు. పైగ రాజున కన్నివిధముల తోడుపడుచుందురు. నాభా, పాటియాలరాజ్యములు రెండుసరిహద్దుననే

యున్నవి. ఉభయరాజులును ప్రజలును సిక్కులేకాని యిరు వురురాజుల తత్వములనువేరు. పాటియాలారాజు స్వార్థపరుడు దురాచార వర్తనుడు. బ్రిటిషు ప్రభుత్వానుచరుడు విదేశములయందే జీవితమును భోగవిలాసములలో దేలుచు గడుపును. తన ప్రజల యిక్కట్టులను విచారింప జూడడు. ఇకనాభా రాజు ప్రజలక్షేమమునకై పాటుపడుచు ప్రజాదరణకు పాత్రుడై సంఘమందలి దేవాలయాదులందలి దురీతిని బాప యత్నించెను. స్వతంత్రభావము జాతీయాభిమానము ఉండుటచే మంచి పేరుగడించెను. ప్రభుత్వోద్యోగు లతనిపై యనుగ్రహము లేకుండ నుండిరి.

భిన్నతత్వముగల సరిహద్దు రాజుల యిరువురకును వ్యక్తిగతద్వేషము కొన్నిసరిహద్దు తగాయిదాలును కలిగెను బ్రిటిషువారందు కలుగజేసుకొనిరి వారియాజ్ఞ ననుసరించి నాభారాజు రాజ్యము వీడవలసివచ్చెను. అతడట్లగుట సిక్కులలో చాలమందికిష్టములేదు. అప్పుడు పంజాబులో సిక్కుల దేవాలయములగు గురుద్వారములలో చాలయపనీతి యక్రమపాలనము జరుగుచుండెను. యజమానులగు మహాంతులు శ్రీమంతులుగ నుండుటచే దురాచారులుగ నుండిరి. కాంగ్రెసు ప్రచారముచే దేశములో ప్రబోధకము కలిగినందున సిక్కులలో కొందరు గురుద్వారములను సంస్కరించుటకు యత్నములు సలిపిరి. మహాంతులకు పాటియాలా రాజు వంటివాడును బ్రిటిషు ప్రభుత్వమువారును చట్టరక్షణమునకై సాయపడిరి. సంస్క

రణపరులు కాంగ్రెసువారి యాదర్శముతో సాంతముగ సత్యాగ్రహ మారంభించిరి. ప్రభుత్వమీ సత్యాగ్రహము నాప యత్నించెను. ఈసంగతిలో నాభారాజు రాజ్యచ్యుతుడు కాగా రాజ్యమును బ్రిటిషు ప్రభుత్వ నియమితుడగు నాంగ్లయుద్యోగి పాలించుచుండెను. నాభారాజుగురువు దమనసింహుని యాపదకు చింతించి యాయనపై నభిమానము తెలుపుటకై కొందర కాలీలు నాభాలోని జైటోవద్ద సభచేసి తమ యాచార ప్రకారము భజనతో సిక్కుమత గ్రంథమగు అఖండపంతును పఠింపుచుండ నాభాలో నపుడున్న బ్రిటిషు పాలకుని కడనున్న యుద్యోగులు ఖాలేసభను చెదరగొట్టి శిక్షించిరి. అపుడు నాభాలోనేగాక పంజాబులో నన్ని ప్రాంతములయు కాలీజట్టు జట్టుగవచ్చి జైటోజేరి అచట గ్రంథమును చదువుటకై సత్యాగ్రహము చేయసాగిరి. వారు శూరులు, ఆజానుబాహులు, పించను పుచ్చుకుండువారైనను కాంగ్రెసు పద్ధతినే శాంతముగ కార్యమును నడపుచు ప్రభుత్వోద్యోగులు తమ్ము హింసించినను తిరుగబడక అహింసా వ్రతమును కాపాడుచుండిరి. ఉద్యోగులీజట్టులను లాఠీలతోకొట్టి గ్రంథపఠనము జరుగకుండ జేయుచు బాధించినపుడు అకాలీలు కాంగ్రెసువారితో విచారణ జేసి తగు సలహా నీయుడని కోరిరి. అకాలీ ప్రార్థనచే కాంగ్రెసు యుత్తరవు ప్రకారము జవహరులాలుగారు గిద్వానీసంతానుగార్లతో గూడ ఆసంగతు లెంతవరకు నిజమో పరిశీలింప దలచి నాభాలోనికి పోయెను. సంస్థానపు సరిహద్దు ప్రవేశించి

కొన్ని మైళ్ళ దూరములో నున్న జైటోనువారు ముగ్గురును చేరుచుండు నాభాయుద్యోగులు వారిని సమీపించి సంస్థానము విడిచిపొండని యాజ్ఞాపించిరి. ఆ విరుద్ధపుటుత్తరువును జూచి వింతపడి తామే నేరము చేయలేదని, సిక్కు జట్టులోని వారము కామని తక్షణముచటి నుండి పోవీలులేదని తెలిపిరి. నాభా యుద్యోగులు వారిని వెంటనే అరెస్టుచేసి జైలులో నుంచిరి. జైలు పరిస్థితులు చాల పాడుగనుండెను. వారిపై నేరారోపణ 15 రోజులు విచారింపబడినది. ముద్దాయిలు చెప్పుకొన వీలులేదు. మేజస్ట్రీటు పోలీసులుచేతి కీలుబొమ్మ సంస్థానపు పరిస్థితులు మోతీలాలుగారికి తెలియుటచే ముద్దాయిల తరపున వాదించుటకు కపిలదేవ మాలవ్యాగారి నట కంపిరి. అచట అవకతవక పద్ధతికి విసిగి జవహరా కేసులో వాదముమానెను. మాలవ్యాగారు కోర్టుకుహాజరై ముద్దాయిల తరపున పనిచేయజూచిరి. అచటిపోలీసులు మాలవ్యాగారిమీద కోర్టులోనే కలియబడి వకీలుగారి చేతిలోని కాగితముల నూడదీసుకొన యత్నించిరట. మేజస్ట్రీటునకు పోలీసులట్టు మరియాద చేయజూచిరట. కపిలదేవుడెట్లో జయుటపడెను. జవహరులాలుకు కుట్రనేరముక్రింద రెండేండ్లు శిక్షపడినది. గిడ్వానీనంతానం గార్లును శిక్షింపబడిరి.

నాభాలో కొమారుని యరెస్టుసంగతి విని మోతీలాలు గారతని క్షేమమేమియు తదుపరి తెలియనందున యథార్థస్థితిని తెలుపవలెనని వైస్రాయిగారికి మోతీలాలుగారు తంతి నిచ్చిరి.

దానికి ప్రత్యుత్తరము వచ్చినట్లులేదు. కేసుచర్యకును తీర్పునకును నకళ్ళు నిమ్మని జవహరులాలు దరఖాస్తుచేసెను. నకళ్ళివ్వలేదు. కాని యచటి యుద్యోగులాయనను జైలునుండి సంస్థానపు సరిహద్దు వెలుపలకు తీసుకొనివచ్చి విడిచిపెట్టి నాభాలోనికి రాకూడదను నిషేధపు టాజ్ఞను చూపిరి. అపుడు కాంగ్రెసువారు సత్యాగ్రహము జరుపుచుండుటలేదు. సంస్థానపు పరిపాలనా విషయములందు జోక్యముకలిగించుకొను తలంపప్పటికి ఇప్పటికిగూడలేదు. అందుచే జవహరులాలుగారచట నుండి లాహోరునకు వచ్చెను.

సంస్థానములలో యిప్పటికిని నిరంకుశపాలనమే సాగుచున్నది. కాని న్యాయచట్టములుగాని ప్రజాభిప్రాయము ననుసరించు బాధ్యతాపాలనముగాని కానరాదు. సంస్థాన ప్రజల ప్రతినిధులు చాలకాలమునుండి కాంగ్రెసు అధికారులను న్యాయసంస్కరణలను ప్రవేశపెట్టగోరుటయేగాక సంస్థాన ప్రభువును న్యాయపద్ధతుల నవలంబించునటుల త్వరలో నేర్పాటయినను చేయించుడని కాంగ్రెసు మహాసభలో నప్పటప్పటి తీర్మానములను పెట్టుచునేయుండిరి. కాని సంస్థానాధిపతులట్లు చేయుటలేదు. క్రొత్తసంస్కరణ ప్రకారము మనభారత ప్రభుత్వశాసనసభలలో ప్రవేశించుటకు పాలనలో వలుకుబడికొరకు సిద్ధపడుచుండిరి. సంస్థానముల యందలి పాలనములో కల్పించుకొనుటకు కాంగ్రెసువారింకను అంగీకారమును చూపుటలేదు.

## 8. ప్రజా సేవ.

అప్పటిస్థితి ననుసరించి కాంగ్రెసువారు శాసనసభలలో కలుగజేసికొనిన లాభములేదనియే గాంధి జవహరులాలు మొదలగువారు తలంచిరి. కాని మ్యునిసిపాలిటీలు బోర్డులు మాత్రము ప్రజలనిత్యజీవనమునకు సంబంధించినవి గాన వాటిని సక్రమముగా నిర్వహింపఁ జాలిన ప్రజాప్రతినిధులకు యనుభవము కలుగునని, నిర్మాణకార్యక్రమమును విద్యారోగ్యము లభివృద్ధి జేయ వీలుగునని యందులకై యీసంఘములలో కాంగ్రెసు వారు ప్రవేశించి వాటిని నడపునేర్పు జెంకుట మంచిదేయని గాంధి పక్షమువారి తలంపు.

పై యెన్నికలలో కాంగ్రెసువారు ప్రవేశించి జయము నొందుచుండిరి. అందుకు నిదర్శనముగ కలకత్తా కార్పొరేషనుకు చిత్తరంజనదాసుగారు, బొంబాయిలో విఠలభాయిపటేలు గారు అహమ్మదు బాదులో వల్లభాయిపటేలుగారు పాట్నాలో రాజేంద్రప్రసాదుగారు వెనుకటి మితవాదుల నోడించి మునిసిపాలిటీల కధ్యక్షులైరి.

అలహాబాదు మునిసిపలు యెన్నికలలో జవహరులాలు గారెన్నుకొనబడి మునిసిపాలిటీకి చైర్మనై నగరమున చాల మంచిపనులను చేయించగలిగిరి. ప్రజాసేవ దేశసేవలోని యంతర్భాగమే. ఆయన పరిపాలనలో మునిసిప లాదాయము 127000 రూపాయలు హెచ్చెను. రోడ్లు, పాఠశాలలు, జల

వసతి, ఆరోగ్యము చాలబాగుపడెను ఆయన కార్యనిర్వాహణ మును, ఆయన ప్రజ్ఞను ప్రభుత్వాధికార్లు రిపోర్టులలో శ్లాఘించిరి. అతడు నగరమున గల పాఠశాలలో రాట్నమును, మగ్గములను పెట్టించుటయేగాక చేతిపనులను నేర్పించెను. నగరమున జాతీయభావము వ్యాపింప ప్రోత్సహించెను ఉపాధ్యాయులు విద్యార్థులు రాజకీయవిషయములను గ్రహించు స్వేచ్ఛను కల్పించెను. పౌరధర్మమును జాతీయభావమును సూచించు గ్రంథములను బడులలో పాఠకపుస్తకములుగ జేసెను. బీదలువసించు పేటల నన్నింటిని యారోగ్యవంతములుగ నుండునట్లు చేసెను.

ఒకసంవత్సర ముత్సాహముపనిచేసిన వెనుక నాతనికసంతృప్తి కలిగినది. డబ్బు ఖర్చుపెట్టుటలోను కార్యములు నడుపుటకును చాల యధికారము తక్కువ ముఖ్యవిషయములలో మునిసిపాలిటీలు లోకలుబోర్డులును రాష్ట్రీయప్రభుత్వపుటంగీకారము పొందక యేపని చేయువీలుండదు. మంత్రులకు మునిసిపాలటీలబోర్డుల సంగతులను గూర్చిగాని రాజ్యాంగవిధులను గూర్చిగాని యనుభవ మల్పము. సాహసమును తక్కువే, ఐ. సి. యస్. శెక్రిటరీ లధికారమును చెలాయించెను. వారును ప్రభుత్వధోరణినే యవలంబింతురు.

అదిగాక మునిసిపాలిటీలకు బోర్డులకు ఆదాయముచాల తక్కువ. పన్నులు వేయుదమన్న బీదజనులకు బాధగనుండును. మునిసిపలు పనులు నెరవేర్చుటకు ప్రభుత్వమునుండి ఋణము

తీసికొనవలెను. అప్పిచ్చిన సొమ్మును ప్రభుత్వమువారు వాయిదాల ప్రకారము వసూలుచేయ జూచెదరు. రాజకీయములలో పాల్గొనినచో ప్రభుత్వోద్యోగులు నిరోధింతురు. దేశసేవ లొనరించు జాతీయవాదుల మునిసిపాలిటీయందుండినవారె క్కువపని చేయబూనుట సహజము. రాజకీయశిక్ష పడినవారధికారులుగ నుండుట ప్రభుత్వాధికారుల కయిష్టము. జవహరు చెయిరుమేనుగా ఉన్నపు డాయనపరిపాలనకు ప్రభుత్వోద్యోగుల వలన చాలయాటంకములు కలిగినవి. అందలిసభ్యులకు కొందరకు పట్టుదల యున్నను దానిని నెరవేర్పజూచు సాహసము లేకుండును. చాలమందిసభ్యులు తమవారికుద్యోగములకుకంట్రాక్టులను సంపాదించుటకే చూచుకొనుట కలదు. అందుచే జవహరు తనశ్రమకు తగిన ఫలితములేదని విసుగుజెంది రెండేండ్లు యనంతరము చెయిరుమేను పదవిని విడనాడెను. తననుసరించుచు సభ్యులకు సలహాను మాత్రము యిచ్చుచుండెను.

జవహరు చెయిరుమన్‌గ నుండిన 1924 సంIIననే జనవరి ప్రాంతమున పుష్కరము జరిగినది. అది 12 డేండ్లకొక సారివచ్చును. పుష్కరమునకు వేలకొలదిజనులు ప్రయాగకు వచ్చి అచట త్రివేణీ సంగమమున స్నానము చేయుదురు. ఆసంవత్సరమున గంగ గట్లను కోయుటచే చాల ప్రమాదమగు స్థితియందుండుట చూచి ప్రభుత్వమువారు ప్రజలందు స్నానము చేయరాదనిశాసించిరి. తామా స్నానముచేయక తప్పదని

ప్రజల పట్టుదల. మాలవ్యాగారు దానికి తగిలీలు కలిగించు మని చెప్పిరి. ఉద్యోగులు ప్రాంతమంతటను ప్రజలు రాకుండ నెత్తగు కర్రలతో నడ్డముగ దడులను కట్టిరి. మాలవ్యాగారా యుదయమున సత్యాగ్రహము సల్పి స్నానము చేయుదుమని ప్రకటించి గంగాతీరమునకు తెల్లవారకముందె బయలుదేరిరి. వేలకొలది జనులాయనను వెంటాడిరి. వారిని యడ్డగింప పోలీసులు వచ్చిరి. వారి గుఱ్ఱపుదళము ప్రజలను స్నానము చేయకుండ నుంచుటకై సత్యాగ్రహమున సలుపనుండిన మాల వ్యాగారితోనున్న ప్రజలడ్డగింప వరుసగ నదిపొడుగున నిలచి యుండిరి. జవహారాసమయమున నెట్లో స్నానముచేసి రాగా మధ్యాహ్నము వరకును కూర్చునియుండిన ప్రజలదీక్షను గని మాలవ్యాగా రప్పటి పరిస్థితి యసందర్భముగతోచి తానెవరి తోడను మాటలాడక సామాన్యునివలె వీరావేశములో గుఱ్ఱపు దళము మధ్యనుండి సాహసముతో దడిసందుననుండి లోనికి జొచ్చి స్నానముచేసిరి. అట్లాయన చేయుటగని నీప్రజలెల్లరు పలుతావులనుండి గుఱ్ఱపుదళములనుదాటి దడులనందునుండి నది లోప్రవేశించి స్నానముచేయగా గుఱ్ఱపు దళమును పోలీసు వారును చేయునదిలేక యటనుండి వెడలిపోయిరి. ప్రభుత్వ మపు దేచర్యయు గావించి యుండలేదు. మతసంధమున జోక్యము కలుగజేసికొనిన హిందువుల కుద్రేకము కలుగుననను తలంపున నేమో వారెవరిమీదను ఏవిధమగు చర్యను చేయలేదు.

9. విదేశమున ప్రచారము.

జవహర్‌లాలుగారి భార్య కమలానెహ్రూగారు 1925, 26 సంవత్సరములలో చాల జబ్బుగనుండెను. ఆమెకు లక్నో లోనే గాక చాలచోట్ల జవహరు చికిత్సచేయించినను గుణమీయలేదు. గాలి మార్పవలెనని చల్లని పరదేశమునకు గొనిపోవలెనని వైద్యులు సలహాచెప్పిరి. అప్పుడతని పెద్దచెలియలగు విజయలక్ష్మియు నామె భర్త రణజితసింహుచును యూరపు ప్రయాణమైరి. వారితో వైద్యమునకై జవహరు భార్యతో నటకేగెను. ఆల్ప్సుకొండల సమీపమునగల స్విడ్జర్లాండు శీత భూమి యారోగ్యప్రదమని ప్రసిద్ధి. అందలి జనీవానగరమున జవహరు భార్యకు చికిత్స చేయించెను. ఆరోగ్యము సరిపడుట కందు మఱికొంతకాల ముండవలసి వచ్చెను.

అచట జవహరు వ్యర్థముగ కాలముగడుపనేలనని జర్మనీ మొదలగు ప్రాంతములకు చనెను. అపుడా దేశమున యుద్ధానంతరమున జరుగుచున్న ఆర్థికరాజ్యాంగ పద్ధతులను కార్మిక సమస్యల రక్షణముపొన్న పనులను, దేశకాలపరిస్థితులను బాగు చేయుట కవలంబించు క్రొత్తవిధానములను, రసాయన విద్యల నూతన విధానములను జవహరు గమనించెను. ఆపద్ధతులు మనదేశమున కేమాత్ర ముపయోగకరములాయని పరిశీలించెను. మనదేశపు పరిస్థితులను యూరపు ప్రజలకు తెల్పుటకు జవహరు చాలగ పనిచేసెను. రాజ్యాంగ వేత్తలతోను, కార్మిక

నాయకులతోడను, పత్రికా సంపాదకులతోను, సంభాషించి వ్యాసములను ప్రకటించి మనదేశమునుగూర్చి వ్యాపించిన యపోహలను చాలవరకు యదార్థస్థితిని తెలుపుటచే మన దేశీయులపై నచటి ప్రముఖుల సానుభూతి కలిగినది. దానివలన యచటి విద్యార్థులచటి విద్యాలయములలో చేరుటయేగాక భారతీయ వ్యాపారము బాగుగ సాగను సౌకర్యములు నేర్పడెను.

విదేశములలో భారతదేశమునకు వ్యతిరేకముగ జరుగు ప్రచారము నరికట్టి నిజస్థితిని తెలిపి మనవారికిని వారికిని యనుగుణ్యత కలిగించుట యవసరమని జవహరు తలంపు. అదిగాక ఆర్థికరాజకీయ పరిస్థితులలో పరస్పర సంబంధము హెచ్చుచున్నది. 20 యేండ్లక్రిందటి యూరపుయుద్ధమువలన మన దేశమున కెట్టిపరిస్థితి కలిగినదియు ప్రజలకు తెలిసినదే.

ఇటలీ, అబిసీనియా యుద్ధమువలనగూడ నాదేశములతో మన వ్యాపారముపట్ల అచటనున్న భారతీయుల పరిస్థితిలోను మార్పు కలిగినది. జపాను వ్యాపారాభివృద్ధి, నమయాములో వ్యవసాయాభివృద్ధి, జావా పంచదార పరిశ్రమ మనదేశపు వ్యాపారములను తారుమారు చేయుచున్నవి. మనదేశపు నిజస్థితి యాంగ్లేయుల కంతగా తెలియదు. మనదేశమునుండి తమ దేశమునకేగిన యుద్యోగులు వర్తకులు క్రైస్తవపాదిరీలు నాదేశమున భారతీయులు తెలివిమాలినవారని ఐకమత్యము లేనివారని నాగరకులు కారని పరిపాలనకు తగినవారు కారని

చెప్పుట కలదు. తమ లాభమునకేగాక మనసంగతి తెలియుని కారణమున గూడ బ్రిటిషువారు మనకు స్వరాజ్య మీయకున్నారు. సామాన్య ప్రజలు భాగ్యవంతుల చెప్పుచేతలలోని వారు. ఈపరిస్థితుల నన్నింటిని ఆంగ్లదేశీయుల కెల్లరకు తెలియ జేయ మనము కొంత ప్రచారము చేయవలెనని జవహారు అభిప్రాయము.

జవహారు యూరపులోనున్న 1927 ఫిబ్రవరిలో బెల్జియం రాజధానియగు బ్రిసెల్సులో బాధితజాతుల ప్రపంచ సభ జరిగినది. మంచివారైనను పరిపాలకులు మరియొక దేశముపై నధికార పాలనము చేయుట మేలుగాదు. అట్టి సామ్రాజ్యము నకు లోబడిన దేశమునకు బాధ కలుగును. స్వతంత్రతలేని జనులు యిబ్బందులను కనిపెట్టి వారికి క్షేమమును గలిగించుటకై యీసభవారు బ్రిసెల్సులో సమావేశమయిరి. ప్రపంచమున పరాధీనమయిన నాగరిక దేశము లన్నిటిలోను మన భారతదేశమే ప్రధానమైనది. అందుచేత నా మహాసభలో భారతదేశపు ప్రతినిధియుండుట యవసరము. ఈసంగతి జవహారులాలుగారు కాంగ్రెసు అధికారులకు తెలిపి వారి యనుమతితో మనదేశపు ప్రతినిధిగ నా సభలో తాను పాల్గొని మన దేశపు ప్రజల స్థితిగతులను గూర్చియు, పాలనాపద్ధతిచే గలుగు చెడుగులను గూర్చియు, వానిని తొలగించు మార్గములను గూర్చియు చక్కని యుపన్యాసము నిచ్చెను. ఆతడు తెలిపిన సంగతుల కచటి రాజకీయ నాయకులును ప్రతినిధులును ఆశ్చర్య

పడిరి. అపుడు సామ్రాజ్య తత్వవిరోధ సంఘము నెలకొల్ప బడెను. ఆయుపన్యాసముతో జవహరుని ప్రతిష్ట లోకమునకు తెలియవచ్చెను. సభవారు జవహరు తమ కార్యసమితిలో సభ్యునిగ నెన్నుకొనిరి.

ఈసభ జరిగిన కొన్ని నెలలకు రష్యాప్లవపు 10 వ వార్షికోత్సవము జరిగెను. రష్యాదేశమునకు 1917 వరకు జారు అన బడు చక్రవర్తులే పాలకులై నిరంకుశముగ పాలించుచుండిరి. చక్రవర్తి కుటుంబము శ్రీమంతులు వైభవముగ జీవించుచుం డిరి. కోట్లకొలది ప్రజలు నిరుపేదలుగనుండి బాధలుపడువారు. యుద్ధసమయమున ప్రజలకష్టములు హెచ్చెను. అదిసహింపలేక ప్రజలు తిరుగబడిరి. 1917 లో విప్లవము జరిగినది. చక్రవర్తి తొలగింపబడెను. రష్యనులు యుద్ధమాపి సంధిచేసుకొనిరి.

ఆమార్పునకు ఫలితముగ విప్లవనాయకుడగు లెనిను రాజ్యమున కంతకును డిక్టేటరు ఆయెను. 1905 లో జరిగిన సంస్కారానుసారముగ గ్రామములలో సోవియటు అనబడు యెన్నిక పద్ధతిని గ్రామపంచాయతు లేర్పడి యుండెను. ఆపద్ధతికితోడు బోల్షివికు పద్ధతియు నమలుకు తేబడెను. అనగ కార్మిక, కర్షకులకే యెన్నిక హక్కు, ఉద్యోగాధికారము, సోవియటు సభ్యత్వాధికారము యేర్పడెను. స్వలాభమునకు గాక సంఘక్షేమమునకే మానవుడుపాటుపడవలె బోల్షివిక్కుల భావన భూమిహక్కునకు ఆస్తిరాబట్టుటకు నాదేశమున తగవులు లేవు. ప్రభుత్వమునకు మతముతో సంబంధములేదు. వివా

హాములకు మతమునకు సంబంధములేదు. ఈసోవియట్ పాలన క్రింద రష్యా పాతపద్ధతి పూర్తిగ మారినది. భూస్వామి యాజమాన్యతను గ్రామసోవియటుచే కుటుంబములోని జనుల యావసరములనుబట్టి సాగుబడికై సాలీనా గ్రామవాసులకు పంచబడును. ఇళ్లు గనులు, రైళ్ళు, కార్ఖానాలు, కర్మాగారములు మొదలగునవి ప్రభుత్వాధికారమందే యుండి ప్రజలయొక్కయు, రాజ్యముయొక్కయు, బాగుకొరకే పనిచేయబడును. రష్యాలో ప్రజలకు పనిపాటలు, ఆహార, వస్త్ర, విద్యాదులు ప్రభుత్వమే యేర్పాటుచేసి అందుకు తగిన బాధ్యత వహించును నియంత యగు లెనిను సర్వాధికారియై దేశమున కీపద్ధతి నియమించెను. ఈపద్ధతికి మొదట కొంత గందరగోలన జరిగినది. కాని తరువాత చక్కబడినది.

రష్యా రాజధానియగు మాస్కో నగరమున నీము హోత్సవము గొప్పగ జరిగినది. అందుకు జవహరులాలు గారికి ప్రత్యేకాహ్వానము వచ్చినది, అప్పుడు మోతీలాలుగా రచట నుండిరి. ఆయనతోను భార్యతోను సోదరితోను గూడి జవహారు రష్యాకువెళ్ళి యచటి యుత్సవమున పాల్గొనెను. లండనులోని సామ్యవాది నాయకుడును పార్లమెంటు సభ్యుడు నగు కీ॥ సకలత్వాలాగా రతనిని కలసికొనిరి. అంతకు ముందు సోవియటు పాలనగూర్చి లోకమున వింతగ జెప్పుకొనుచుండిరి. జవహారు రష్యానుగూర్చి ప్రచురింపబడిన పుస్తకములను

చదివి యచటి పద్ధతులను చూచి సంగతిని తెలిసికొనెను. అపుడు కాంగ్రెసుసభ జరుగనై యుండుటచే రష్యానుండి మరలి వచ్చెను. అపుడు ప్రీవీకౌన్సిలులో విచారణజరుగు జమీందారీ కేసులలో సైమనుదొరగారితో వాదించుటకు మోతీలాలు గారు 1928 వరకు లండనున నుండిరి. ఆ కేసు మొదట అలహా బాదు విచారణలో జవహరులాలు వకీలుగపనిచేసెను. ఆ కేసును గూర్చి జవహరుగారికి బాగుగ తెలిసియుండినందున సైమను గారి కోరికమీద నతడు లండనువచ్చి కేసుసంగతి సైమను గారితో మాట్లాడి 1927 డిశంబరున నచటినుండి భార్యను తోడ్కొని లాహోరు చేరుకొనెను.

## 11. సయిమను కమీషను.

జవహరులాలు 1927 డిశంబరునెల చివర మదరాసులో జరిగిన కాంగ్రెసు సమావేశమున పాల్గొని జాతీయకార్యము లలో నతడు చేసిన కృషివలన నా కార్యములకు నూతనజీవము యుత్సాహము జనించెను. ఆతని భావములు కాంగ్రెసుతీర్మాన ములలో స్థిరపడినవి. శాసనసభలలో స్వరాజ్యవాదులు కావిం చిన పనికి ఫలితము లేకుండెను. జాతీయవాదులలోనే హిందు వులు మాలవ్యా లాలాజీల నాయకత్వమున నేషనలిష్టుపార్టీగ యేర్పడిరి. ముసిలింలు ఇండిపెండెంటుపార్టీగ నేర్పడిరి. ఈమత కలహముతో ఐక్యము లేకుండ గాంధిగారు రాజకీయసంబంధ

మును వీడిరి. ఈభేదభావముల నేకీభావము చేయగల సమర్థుడు కావలసియుండెను.

అపుడు జవహరునకు సంపూర్ణ స్వాతంత్ర్య కావలెనను తీర్మానము పెట్టి యందరిచేత నామోదింపజేసెను. దీనిని 1923 న కాకినాడ కాంగ్రెసున నామోదింపబడినది. జవహరులాలుగా రపుడు హిందుస్థానీ సేవాదళమున కధ్యక్షులయిరి.

భారతదేశపు వివిధపక్షముల ప్రతినిధులును కలసి మన దేశపాలనకొరకు పద్ధతిని తయారుచేయదగునని కాకినాడ సభలో తీర్మానింపబడెను. ఈసభ ముగియగనే జవహరులాలుగారు కాంగ్రెసు ముఖ్యకార్యదర్శిగ నియమింపబడిరి. అప్పటినుండి యతడు గాంధిగారికి శిష్యుడుగగాక స్వతంత్ర నాయకునిగ మెంచగడంగిరి. కాంగ్రెసులో నాయనయే సమన్వయకర్త. అప్పటినుండియు ప్రత్యేకకార్యక్రమముతో స్వతంత్రసిద్ధాంతములను జనులలో వ్యాపింపజేయ దొడగెను.

తమ పట్టుదలచే జాతీయకార్యముల కాటంకము కలుగ జొచ్చెను. రాజ్యాంగమున జాతుల ప్రత్యేకపు హక్కులను గూర్చి తగవులు కలిగెను. వాటిని పరిష్కరింప నెహ్రులు చాల పాటుపడిరి. దానిచే నది పరిష్కరింపబడెను. కాని సప్రూ మొదలగు మితవాదులు సర్వపక్షసభలో నుండుటచేత వారికి తృప్తికలుగుటకై రాజ్యాంగమున పూర్ణస్వరాజ్యా దర్శము తగ్గించి బాధ్యతాయుత ప్రభుత్వపద్ధతిని దెల్ప దానిని సభ్యులంద రంగీకరించిరి. ఆసభకు మోతీలాలు నెహ్రుగా రధ్య

త్ములు. అందుచే దానికి నెహ్రూకమిటీ రిపోర్టను ప్రసిద్ధి. ఆ రిపోర్టు అంశములు చర్చకువచ్చెను. అంచలి రాజ్యాంగపద్ధతి సంకుచితమని సంపూర్ణస్వాతంత్ర్యమునకు నెంతమాత్రము తగ దని జవహరులాలుగారు సభలో తెలిపిరి.

దేశమాంద్యమును తొలగించి యుత్సాహము కలిగింప నున్నత సంపూర్ణస్వాతంత్ర్యపు ఆదర్శమును వ్యాపింపజేయుట మంచిదని జవహారుని యభిప్రాయము.

మనకున్న రాజ్యాంగపద్ధతి విమర్శించి నూతన రాజ్యాం గమును స్థిరపరప బ్రిటిషుప్రభుత్వ మొక సంఘమును 1927 న నియమించిరి. ఆసమయమున కధ్యక్షుడు సర్ జాన్ సయిమను గారు. అందుచే నది సయిమను కమీషనని పిలువబడెను. స్వయంనిర్ణయనూత్ర మీ విచారణలో నేల పాలయినది. అందు భారతీయసభ్యులు లేరు. దానిని బహిష్కరింపవలెనని మద్రాసున కాంగ్రెసువారు తీర్మానించిరి.

కమీషను సభ్యులీ దేశపు ముఖ్యనగరములలో 1928 ని సంచారము చేసిరి. దానికి ప్రజల యామోదము లేదని తెలుపుటకు హరతాళము జరిపి నల్లజండాల యూరేగింపు జరు పుటకు కాంగ్రెసువా రేర్పరచిరి. జవహారులాలుగారు తమ ప్రాంతమున నీకార్యములను బాగుగ నడిపించిరి. జండాల యుత్సవము కాకుండ చేయును పోలీసువారు వాలంటీర్లను లాటీలతో చెదరగొట్టిరి. అపుడు జవహారులాలుకేగాక ఆయన తల్లి మొదలగువారికిగూడ చాలదెబ్బలు తగిలినవి. కమీషనరు

యెదుట సాక్ష్య మిచ్చుటకు పిలువబడినవారు చాలమంది రాలేదు. కమిటీ వచ్చినరోజున నగరమున ప్రజల యాలుకుడు లేకుండెను. లక్నోనగరమున జవహారీహారతాళమును బాగుగ నడిపించెను.

మనదేశమున నిపుడున్నప్పుడు బ్రిటిషు డొమినియనుల కిదివరకున్న స్వాధికారాధికారము బాగుగ హెచ్చింపబడినది. సర్వసంఘ సభలో మోతీలాలు మొదలగు పెద్దలు క్రొత్త డొమినియను పద్ధతి మనకు చాలుననుకొనిరి. బ్రిటిషు అధికార సంబంధములేని స్వరాజ్యమే కాంగ్రెసు లక్ష్యమని యొకపక్ష నాయకుడగు జవహారు బహిరంగపు ప్రచారము సలుప గడంగెను.

## 12. స్వాతంత్ర్య ప్రచారము.

1928 లో కాంగ్రెసుసభకు మోతీలాలుగా రధ్యక్షులు. అది కలకత్తాలో జరిగెను. నెహ్రూరు కమిటి రాజ్యాంగమును కాంగ్రెసువా రామోదించవలె నని మోతీలాలు గారు పట్టు పట్టిరి. 1927 లో చేసిన సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానమున కది భిన్నమనియు, కాంగ్రెసు లక్ష్యము నిట్లు తగ్గించరాదనియు జవహారుని యాక్షేపణము కొన్నిసవరణలతో నెట్లో నెహ్రూ రిపోర్టు కాంగ్రెసున నంగీకరింపఁ బడినది. అపుడు సంపూర్ణ స్వాతంత్ర్యమే కాంగ్రెసు లక్ష్యమని స్థిరపఱుప జవహారులా

లోక తీర్మానము గావించి ధైర్యముతో వాదించెను. అందుపై తీవ్రచర్య జరిగినది. అపుడే ప్యాసుచేసిన నెహ్రూకమిటి రాజ్యాంగ ప్రణాళిక నిద్రపోసి రాజనునని పెద్దలు తెలిపిరి. అప్పుడు పరిస్థితి చెడకుండ గాంధిగారు యుక్తితో రెండుపక్షములను తృప్తిపర్చ గలిగిరి. అదెట్లనిన.

నెహ్రూకమిటీ రాజ్యాంగ మొక యేడాదిలోగ నమ ులులో పెట్టుటకు ప్రభుత్వమువారికి గడువనిచ్చుటకును 1929 డిశంబరునాటి కది యొనగబడనియెడల సంపూర్ణ స్వరాజ్యమే కాంగ్రెసు నియమముగ నుండుటకును గాంధిగారు నిర్ధారణ చేసిరి. ఈనియమ ముభయపక్షము లంగీకరించినవి. ఆంగ్లేయు లకును మనకును ఆర్థికముగ సంఘర్షణ ముండుటచే సామ్రాజ్య మున డొమినియను అధికారము మనకిచ్చుటయు, నది మనకు ఖాయమగుటయు ననంభవమని అందుచే సంపూర్ణస్వాతంత్ర్యమే మనకుండవలె ననియు జవహరుని యభిలాష.

మనదేశపు కార్మికులను రైతులను చాల బీదలుగను యజ్ఞానులుగ నున్నారనియు వారి నుద్ధరించుట దేశక్షేమము నకు ముఖ్యమని 1920 లో జవహరు గ్రహించెను. అందు కొఱకు 1928 లో ట్రేడు యూనియను అను కార్మిక సంఘ సమితి కాంగ్రెసు కార్యములలో పాల్గొనెను. ఆ సాలాఖరున ఝరియాలోని సంఘవార్షికసభ జరిగినది. సంఘమువారి రాబోవు సాలనకు జవహరులాలుగారిని తమ యధ్యక్షుని యెన్ను కొనిరి.

అప్పటినుండి జవహరు సోషలిజమ్‌ను గూర్చి ప్రచారము చేయగడగెను దానితో కార్మికనాయకులు చాలమంది సామ్య వాదబోధ చేయ మొదలిడిరి. కార్మికులలో నలజడి కలిగి సమ్మెలు పలుచోట్ల జరిగినవి. అప్పుడు ప్రభుత్వమువారు కార్మికనాయకుల నెందరినో యరెస్టు చేసిరి, కేసులు పెట్టి శిక్షించిరి. ఈ సందర్భమున మీరటకుట్రకేసులో చాలమంది కార్మిక నాయకులు ముద్దాయిలుగనుండిరి. ఆవిచారణ 4 గేండ్లు జరిగినవెనుక చాలమంది శిక్షింపబడిరి. అప్పీలులో కొందరు విడుదలగుటయు, కొందరికి శిక్ష తగ్గింపబడుటయు జరిగెను. ఈ ముద్దాయిల సహాయమునకు డిఫెన్సుకమిటీ యేర్పడెను. మోతీలాలుగా రందొక సభ్యుడు. జవహరులా లందునిమిత్తము చాల పాటుపడెను. 1929 లో ట్రేడుయూనియను కాంగ్రెసు వారిసభ నాగపురమున జరిగినది. జవహరలాలానభ కధ్యక్షుడై కార్యక్రమమును జయప్రదముగ జరిపి కార్మికులకు సలహాచెప్పి యుత్సాహమును కలిగించెను.

1929 సాలాఖరులోగ డొమినియను రాజ్యాంగమీయ బడలేదు వైస్రాయి ఇర్విను ప్రభువునకును గాంధిగారికిని రాయ భారము జరిగినను ఫలించినదికాదు. ఆ సంవత్సరాంతమున లాహోరులో జరిగిన కాంగ్రెసు మహాసభకు గాంధిగారి సలహా ననుసరించి జవహరులాలుగా రధ్యక్షులయిరి. పిన్నవయసు వారు కాంగ్రెసున కధ్యక్షులగుట అరుదు. అప్పటి జవహరు వయస్సు 40 యేండ్లు. ఇట్టివా రిరువురు మాత్రమే కాంగ్రెసు

సభ కధ్యక్షులైరట. అందొకరు గోకేలుగారును రెండవవా రబ్దుల్ కలాం అజాదుగారును, జవహరు అధ్యక్షోపన్యాసమున తన సిద్ధాంతములను, ఆదర్శములను కార్యక్రమమును ప్రజల కుత్సాహము గలుగజేయు భాషలో స్పష్టముగ తెలిపెను సోష లిస్టు ప్రణాళిక మంచిదని రష్యాలో సోవియటునాయకు లవ లంబించు పద్ధతులు మనకు పనికిరావని పూర్ణస్వాతంత్ర్యమే జాతీయలక్ష్యముగ నుండతగునని యుక్తియుక్తముగ తెలియ బలికెను కలకత్తా కాంగ్రెసులో తెలిపిన గడువు గతించినందున పూర్ణస్వాతంత్ర్యమే కాంగ్రెసుకు ముఖ్యమని ఆసభలో గాంధి గారుపపాదించిరి. ఆయుపపాదనకు 15 గురు వ్యతిరేకులైరి. వేలకొలది ప్రతినిధు లాతీర్మానము నంగీకరించిరి. దానిని సాధించుటకై గాంధిగారి నాయకత్వమున సివిలుడిజొబీడియెన్సు నలంబించుటకును నిర్మాణకార్యక్రమ మీవలోగ బూర్తిచేయు టకును లాహోరు కాంగ్రెసువారు తీర్మానించిరి. జవహరు అధ్యక్షత నిట్లు కాంగ్రెస్ సభ్యులెల్లరు నుత్సాహపూరితులయిరి.

## ౧3 ఉప్పు సత్యాగ్రహము

ఫిబ్రవరినెలలో జవహరుగారి యధ్యక్షతను కార్యసంఘ మువారుచేరి రాబోవు సత్యాగ్రహమునకు గాంధిగారిని నియమం తగ జేసిరి. అందుకు తనప్రాంతమును జవహరు సిద్ధముచేయ దొడంగెను. నాయకు లన్నిప్రాంతములలోను ప్రచారముచేసిరి.

ప్రభుత్వము ప్రజలకవసరమగు సంస్కరణలను ప్రారంభించిన గాని సత్యాగ్రహ ముప్పుతో నారంభించునని గాంధిగారు మార్చిలో వైస్రాయిగారికి తెలిసిరి. ప్రభుత్వము సంస్కరణాను వలుప నిరాకరించెను. ఏప్రియల్ మొదటివారమున నొక దళముతో గాంధిగారు గుజరాతులో దండిరేవున సముద్రపు టొడ్డున నుప్పుచేయ మొదలిడిరి. శాసన సభలందలి కాంగ్రెసు సభ్యులు అసెంబ్లీ అధ్యక్షుడగు విఠలభాయిపటేలుతో సహా సభలను వదలి వచ్చిరి.

జవహరు ప్రోత్సాహమున మోతీలాలుగారు అలహాబాదులోని యానంద భవనకిరియావరణమును తనకుటుంబగృహమును కాంగ్రెసుకు శాశ్వతముగ నిచ్చివేసిరి. అప్పటినుండి యది స్వరాజ్యభవన మనబడుచు అఖిలభారత కాంగ్రెసు కార్యస్థానముగ నున్నది.

ఉప్పుపైన ప్రభుత్వమువారు హెచ్చుపన్ను విధించిరి. నిరుపేదలకు కావలసినది యుప్పు. అది సముద్రముందు గనులలో సంమృద్ధిగ దొరకును. అట్టిదానికి పన్నువేసి యుప్పుచేసికొనకుండ నరికట్టుటవలన నాంగ్లేయ స్టీమరువర్తకులు స్టీమరుల యడుగున సీమయుప్పువేసి తెచ్చి మనకమ్మి లాభ మొందుచుండిరి. శాసనసభవారు పన్నుతొలగింపకోరినను ప్రభుత్వము వారు దానిని తొలగింపలేదు అందుచే "వ్యక్తి స్వతంత్రతను కాపాడుటకు సకలపనులకు వీలగునట్లు మొదట నుప్పుశాసనము

నుల్లంఘింపదలపెట్టిరి. గాంధిగారరెస్టయి జైలులోనికి పోయిరి. నాయకుల ప్రోత్సాహమున దేశమున వేలకొలది జనులు పన్ను దర్వారలకుపోయి బహిరంగముగ నిష్పూతయారుచేయ నారంభించిరి. జవహారపుడొక జట్టుకు నాయకుడై శాసనోల్లంఘనము చేసెను. చాలమంది నాయకులరస్టయి శిక్షింపబడిరి. స్టాట్టు ఆక్టు ననుసరించి జవహారారునెలలు శిక్షింపబడెను. తరువాత సీమనూలుబట్టల కొట్టుకడను, కల్లుదుకాణములకడను కాంగ్రెసు వారు పికెటు చేయనారంభించిరి. ఆసత్యాగ్రహమువలన సీమబట్టల యమ్మకము తగ్గుడు నిలిచిపోయెను. ఖద్దరుబట్టకు గిరాకి కలిగినది. అదిదొరకలేదు. ఈదేశపు మిల్లుబట్టల కొను బడి యారంభమైనది. మిల్లులవారు తమబట్టలధర హెచ్చుకుండను సీమనూలుతో బట్టల నేయకుండుటకును, కాంగ్రెసు షరతులకు లోబడుటకును మోతీలాలుగారు 1920 జూను నెల లో బొంబాయిమిల్లు యజమానుల నొప్పింప గలిగిరి.

అపుడు సీమబట్టలు నూలుబేళ్ళు బొంబాయిరేవున నిల వయె ఇంగ్లండున తొట్రుపాటు కలిగినది. జూన్ నెలాఖరున ప్రభుత్వమువారు మోతీలాలుగారిని అరస్టుచేసిరి. జైలుకంపిరి. స్త్రీలుకూడ పికెటింగును ప్రారంభించిరి. యరెస్టు కాజొచ్చిరి. జవహారు తల్లి, భార్య, సోదరి మొదలగు వారెందరో జైలున నుంచబడిరి. వేలకొలది సత్యాగ్రహమున పాల్గొని జయిలు నకు సిద్ధపడుచుండుటచే ప్రభుత్వోద్యోగుల కిది పనిగ యేర్పడి నది. అపుడు మితవాది నాయకులగు సప్రూజయకరుగార్లు

ప్రభుత్వమువారి యిష్టముమీద కాంగ్రెసు ప్రభుత్వమునకు రాజీ కుదుర్చుటకు చూచిరి. అందుకై జవహారులాలును మోతీలాలునెహ్రూను నైనిటాలుజయిలునుండి యెరవాడ జయిలుకు ప్రభుత్వమువారు తెప్పించిరి. అచట మాటలు జరిగినవి కాని రాజీ కుదరలేదు. జవహారు జయిలులో నూలువడకుచు గ్రంథకాలక్షేపము చేయుచు వ్రాయుచు నుండువాడు. మోతీలాలుగారు జబ్బుపడుటచే విడువబడిరి. శిక్ష పూర్తియై జవహారు విడువబడెను. దేశస్థితినిబట్టి జవహారు తండ్రికి జబ్బుగనున్నను గృహమునసుండక డబ్బులేక పన్నులీయలేని రైతుల నుద్యోగులు నిర్బంధింపసాగిరి. జవహారు సలహాతో రైతులు జిరాయితీ పన్ను లీయ నిరాకరించిరి. జాతీయాభివృద్ధికి రైతుల క్షేమము ముఖ్యమని జవహారు తలంపు అందుచే జవహారా యుద్యమమును నడువబూనెను. జమిందారులు ప్రభుత్వము ఏకీభవించిరి. అందుకు ప్రభుత్వము న్యాయమునకు నాయకుడగు జవహారును అరెస్టుచేసి శిక్షించి జయిలు కంపిరి. పన్నులపుడు వసూలు కాలేదు.

వివమస్థితిలో సైమను కమీషను నూతన రాజ్యాంగమునుగూర్చి రిపోర్టు నిచ్చినమీదట కొందరి భారతీయుల అభిప్రాయమును సానుభూతిని సంపాదించుటకై బ్రిటిషువారు లండనులో సంప్రదించుటకై తనకిష్టులగు హిందువులను కొందరిని పిలచిరి. అందుకు కులతత్వాభిమానులు జమీందారులు దేశీయరాజులునుండిరి. వారికి జాతిరక్షణ దేశరక్షణయును భావ

నలేదు. నిజముగు ప్రజాప్రతినిధులు కారు. ఆసాలున సీమవస్తు బహిష్కారము మంచి తీవ్రముగ సాగుచుండెను. ఆంగ్ల వర్తకులకు కోట్లకొలది నష్టము వచ్చుచుండెను. ఆ బహిష్కారమూలి పరిస్థితి చక్కబడుట మంచిదని ప్రభుత్వమునకును దేశీయులకును తోచెను. కఠిన శాసనములు, శిక్షలు, లాఠిప్రయోగములు చాలచోట్ల జరుపబడినవి. ఆ యహింసాపోరాటము లోకోత్తరమగుటచే నాగరికత ప్రపంచదృష్టిని నాకర్షించినది. అన్ని దేశములకు మనపట్ల సానుభూతి కలిగినది. ఇంగ్లండున పాలనచేయు కార్మిక ప్రభుత్వమువారి యొప్పందలతో సప్రూ జయకరుల ద్వారా రాజీమాటలు జరిగినవి. కాంగ్రెసు కార్యసంఘ సభ్యులను విడుచు టవసరమయ్యెను. అందుకు జైలులోని యితరనాయకులతో సహా అధ్యక్షుడగు జవహరులాలును గూడ 1931 లో విడచిపెట్టిరి. రాయభారపు సంప్రతింపులు జరుగుచుండగనే మోతీలాలుగారికి చాల జబ్బుగ నుండెను. నాయకుల సభ ప్రయాగలో జరిగెను. మంచి చికిత్స జరిగినను మోతీలాలుగారి జబ్బు కుదురలేదు. లక్నోకు తీసుకొనిపోయి ది 6–3–1931 తేదీని యతడు కాలవశుడయ్యెను.

జవహరులాలు ఉత్తరక్రియలు జరుపగనే రాయభారము జరుగుచున్న ఢిల్లీకి వచ్చెను. కాంగ్రెసు తరపున గాంధిగారే ప్రతినిధియై వైస్రాయితో సంప్రదింత 15 రోజులు గడచిన వెనుక నెట్టులో కాంగ్రెసునకును ప్రభుత్వమునకును తాత్కాలిక

సంధి కుదిరెను. దీనికె గాంధి ఇర్విను పాక్టని పేరు. ఆ సంధి షరతుల ప్రకారము తమ కుటుంబావసరమునకు చాలునన్ని ఉప్పు పన్ను లేకుండ చేసికొనుటకును, సత్యాగ్రహ ఖైదీలను వదులుటకును, మనదేశమునకు పెద్దలు పద్ధతిని ప్రజలకు బాధ్యతాయుత రాజ్యాంగ మిచ్చుటకును, సర్కారువా రంగీకరించిరి. భారతీయుల క్షేమమున కవసరమగు రక్షణాధికారము లుండుట కుభయులు నంగీకరించిరి ఈ రక్షణాధికారముల సంగతి జవహరులాలునకు తృప్తిపడలేదు. గాంధిగారును తక్కిన నాయకులును అంగీకరించిరి. కాంగ్రెసువారు సత్యాగ్రహమును మానిరి. ఆర్డినెన్సులపేర జారీచేసిన నిర్బంధశాసనములను, ఆస్తుల జప్తులను రద్దుచేయబడెను.

## 14. కరాచీ కాంగ్రెసు

ఆ యొడంబడిక ప్రకారము సత్యాగ్రహులు విడుదలైరి. 1931 మార్చి యాఖరున వల్లభాయి పటేలుగారి అధ్యక్షతను కాంగ్రెసు వార్షికసభ కరాచీలో జరిగెను గాంధి యిర్విను యొడంబడిక యామోదింపబడెను. యువకుల తరపున జవహరులాలుగారు రీతిగా నూచనలను జేసిరి. ఆ రాజ్యాంగమున విదేశార్థిక సేనావ్యవహారము లన్నియు ప్రజాప్రతినిధుల యాజమాన్య మందుండెను. సర్కారువారు చెప్పు రక్షణాలు ఈదేశీయులకు క్షేమకరమైనవిగ యుండవలెను. మనదే

శపు ప్రభుత్వమునుండి బ్రిటిషువారికి రావలెనని సర్కారువారు చెప్పుజాతీయఋణము లో దేశీయులెంత భాగము వహింప దగునో పక్షపాతములేని పంచాయితీదార్లు నిర్ణయింపవలెను. ఆసొమ్మ్ము దేశీయులివ్వవలెను. ఆసూచనల ప్రకారమే కాంగ్రెసు వారు తీర్మానించిరి. నిర్మాణకార్య నిర్వహణ మవసరమని నిర్ధారణ చేయుబడెను.

ఈకాంగ్రెసు సమయమందే కాన్పూరులో హిందూ మహమ్మదీయుల మధ్య కొట్లాట జరిగి అందు చాలమంది హతులైరి. ఆజగడమున జవహరులాలుగారికి కుడిభుజముగ పనిచేయు గణేశశంకరవిద్యార్థియను వీరుడు మహమ్మదీయుని రక్షింపబోవ గుండాచే చంపబడెను. ఈవార్త జవహరునకు శోకమును గూర్చినవి. ఆసమయమునగూడ దేశసేవ మరువక సామాన్యజనుల రక్షణచేయు నొక యుపపాదనను సిద్ధముచేసి కాంగ్రెసువారిచే దాని కంగీరింపఁజేసెను. దీనినే ఫండమెంటలురైట్సుతీర్మాన మందురు. ఈతీర్మానము సామాన్యప్రజకు లాభకరమును జాతీయవాదులకు సాంఘికవాదులకు సమ్మతమునై యుభయులకు సహాకారము చేయును. 1931 ఆగష్టున సవరింపబడిన ముఖ్యతీర్మాన భావమీ క్రింద తెలుపబడినది.

## 15. మూలాధారములు.

1. ప్రతిభారతీయునకు మాట్లాడు స్వేచ్ఛ సభలలో జేరెడధికారము, శాంతముగ నిరాయుధను సమావేశమగు స్వాతంత్ర్యము

2. ప్రతి పౌరుడును మనోభావము స్వతంత్రత కలిగి సంఘశాంతికి నీతికి లోబడి తనమతమును స్వేచ్ఛగ జరుపుకొన వచ్చును.

3. ప్రతిప్రాంతమున నల్పసంఘముల యభివృద్ధి, భాష వ్రాత రక్షించబడును.

4. చట్టములు జాతి కులభేదము స్త్రీపురుష వ్యత్యాసములేకుండ పౌరులెల్లరు నొక రీతిగనే పొందజేయును.

5. ఉద్యోగములకు గౌరవపదవులకు వృత్తివ్యాపారములకు జాతిమతభేదములు పాటింపబడవు.

6. నూతులు, చెరువులు, పాఠశాలలు జనసమావేశపు చోట్లు సర్కారువిగాని స్థానిక సంస్థలవిగాని ప్రజలొసగినదిగాని ప్రజలకు సమానహక్కు గలదిగనే యుండును.

7. ముందు స్థిరపడు నిబంధనలకులోబడి ప్రతిపౌరుడు నాయుధముల నుంచుకొనియు ధరింపవచ్చును.

8. చట్టమును వ్యతిరేకముగ శరీర నిబంధము ఆస్తిని వశము చేసుకొనుట జరుపబడదు.

9. అన్నిమతముల గూర్చియు సర్కారువారు తటస్థముగ నుందురు.

10. వయసు వచ్చినవారికి ఎన్నికహక్కుగలదు.

11. ప్రభుత్వము వారందరికి యుచిత ప్రారంభ విద్య నిర్బంధముగ నేర్పుదురు.

12. ప్రభుత్వమువా రెవరికిని బిరుదులీయరాదు.

13 మరణదండన ముండదు.

14. ప్రతిపౌరుడును భారతదేశమంతటను తిరుగుటకును అం దెటనేని నివాసమునకు ఆస్తిసంపాదనకు, వృత్తివ్యాపార ములు చేయుటకు హక్కుకలదు. చట్టపుఅమలులోను రక్షణ లోను వారలెవరైనను భేదముండదు.

16. కార్మిక సమస్య.

1. ప్రజల యార్థిక జీవము న్యాయ సూత్రాను కూలముగను, జీవన సుఖముగాను నిర్ణయము చేయబడును.

2. పనివారిక్షేమమును ప్రభుత్వమువారు కాపాడుదురు. వారికి జీవితావసరమగు కూలిని, పనులలో నారోగ్యరక్ష ణము, పనికి కాలపరిమితి. యజమానులకు పనివాండ్రకు వచ్చు తగవుల సవరణ కేర్పాటు, పనివాండ్రకు ముసలితనము, రోగ ము, పనిలేకపోవుట కలిగినపుడు తగురక్షణ, శాసనములచే ప్రభు త్వమువారు కలిగించెదరు.

3. పనివాండ్రకుదాస్య నిబంధన యుండరాదు.

4. ఆడకూలీలకు రక్షణప్రసవకాలమున సెలవు ఏర్పాటు చేయబడును.

5. విద్యార్థి దశలో బాల బాలికలను గనులలోను యంత్రాలయములలోను పనుల కుంచరాదు.

6. కార్మికుల రైతులు తమ రక్షణకై సంఘములుగ నేర్పడవచ్చును.

## 17. పన్నువిధానము ఖర్చు.

7. ప్రస్తుత భూస్వామిపద్ధతియు, పన్ను విధానమును సవరింపబడును. వ్యవసాయభూముల పన్నుభారము సవ్యముగ సరదబడును. అల్పవ్యవసాయదారుల భూములకున్ను జమీాందారి శిస్తును ప్రభుత్వపుపన్నును తగు రీతిగ తగ్గింపబడును. గిట్టుబాటులేని భూముల పన్నవసరమైనంత కాలము లేకుండ నుండును. మినహాయించినను, తగ్గించినను నష్టమువచ్చుచున్న భూస్వాములకు న్యాయపరిహార మియ్యబడును, అల్పభూముల వారికి ఖర్చులుపోను మిగిలినకొద్ది భూమియాదాయమునకును రాబడి పన్ను కట్టబడును.

8. చనిపోయినదాని యాస్తి విలువపై అనంతర హక్కుదారువల్ల పన్ను రాబట్టుటయు, ఆస్తి నిలువ హెచ్చిన పన్ను రేట్లు హెచ్చును.

9. సేనకు ప్రస్తుతమగు కర్చును సగముకైనను తగ్గించబడును.

10. సివిలుశాఖలలో జీతముల కర్చు చాల తగ్గిపోవును. నిపుణతగల నియమితులకు తప్ప సర్కారురువ నేయుద్యోగిని నెలకు సాధారణముగ రు 500 లకు మించిన జీతమియ్యబడదు.

11. దేశమున తయారగు ఉప్పునకు పన్నుండదు.

ఆర్థికసాంఘిక ప్రణాళిక.

12. విదేశవస్త్రములును నూలును యీదేశమునకు రాకుండజేసి ఈదేశపుబట్టల రక్షణకు తగు చర్యలు జరుపబడును. ఈదేశపు యితర పరిశ్రమలకును సీమసరుకు పోటీనుండి రక్షణ యొసగబడును.

13. వైద్యమునకు తప్ప మద్యమును నిషావస్తువులను వీలగునంతవరకు బహిష్కరించడమగును.

14. ద్రవ్యవిధానము నాణెముల మారకము దామా షాయిగ జాతికి క్షేమమగు రీతిని నియమింపబడును.

15. వ్యాపారరక్షణములగు ముఖ్య పరిశ్రమలు. ఉద్యోగములు, గనులు, రైళ్ళు, కాలువమార్గములు, నౌకా వ్యాపారము, రాకపోకలు, సాధనములు సర్కారువారి స్వాధీన మందో వారి యధికారమునకు లోబడియో యుంచబడును.

16. ప్రత్యక్షముగను పరోక్షముగను రైతుల ఋణ బాధను తగ్గించబడును.

17. మామూలు సేనలకుతోడు జాతీయ రక్షణకై పౌరులకు సైనికశిక్షణను ప్రభుత్వమువా రిచ్చెదరు.

జవహరు నిర్ధారణచేసిన నీ తీర్మానములోని చాల భాగము నాగరికప్రజలందరకు సమ్మతమే. 1928 ది నుండి మన దేశమున సాంఘికవాదుల ప్రచార మారంభ మయినది దానికి జవహరు సాయపడుటయేగాక సమయము చిక్కినపుడు సిద్ధాంతమును వ్యాపింపజేయజొచ్చెను. కార్మికపక్షపు తీవ్రవాదులు కొందరు భారతీయస్థితిగతులు నాలోచింపక సామ్యవాదుల ప్రేరణచే సాంఘికవాదులు గాంధిగారికి కాంగ్రెసు సిద్ధాంతములను దూషింపసాగిరి.

అందుచే జాతీయోద్యమ భంగము కలుగుచుండును. జవహరు దానిని నిరోధించి సాంఘిక సిద్ధాంతములకు కాంగ్రెసు ప్రణాళికకును సమన్వయము కలదని నిరూపించి కార్మికవాదులు రైతులు కాంగ్రెసు సభ్యులై సేవచేయ దగునని జాతీయసంస్థ యగు కాంగ్రెసుకు వ్యతిరేకము చేయరాదని బోధించెను. దానితో కాంగ్రెసు సోషలిస్టుపార్టీ యను పేర నొక సంస్థ యేర్పడి తమ సిద్ధాంతములను కాంగ్రెసుకు వీలుగ ప్రచారము చేయుచుండిరి. జాతీయకార్యములో కలువక పనిచేయుచుండు టచే జవహరునకు స్వస్థతలేకుండెను. విశ్రాంతికొరకు సింహళమున కుపోయి, అచ్చటకూడ జాతీయతను ప్రచారము చేయుచుండు టచే జవహరునకు స్వస్థతలేకుండెను. విశ్రాంతికొరకు సింహళము నకుపోయి అచటకూడ జాతీయతను ప్రచారముచేసి లంకనుండి

మళయాళమునకు చని అందుండి మైసూరు హైదరాబాదు ప్రాంతములకు వచ్చిరి.

ఈలోగా పరిస్థితులు తిరుగ విషమించుచుండెను. లండను సభలో చర్చ ఫలము లేకుండ పోయినది. దేశమున నార్థికపు టిబ్బంది వచ్చిపడినది. యూరపులో మనదేశపు వ్యాపారము కట్టుబడినది. ధాన్యముల ధరలు తగ్గుముఖము పట్టెను. రైతులు సర్కారుసిస్తుల నియలేక పోయిరి. జమీందార్లు మొఖాసాదార్లు సిస్తులను మానరు. రైతులేమియు తోచక కాంగ్రెసు వారి సలహా పొందకోరి జవహరు మున్నగు జాతీయ నాయకులతో చెప్పుకొనిరి. గాంధి యిర్విను సంధి ప్రకారము పన్నుల విషయమున రాజకీయ సత్యాగ్రహమును మానుట కేర్పాటు. అందుకు జవహరు సిస్తుల నిరాకరణము నంగీకరించెను. దానితో సిస్తుల చెల్లింపాగిపోయినది. సర్కారు పన్ను వసూలును తగ్గినది. సర్కారు ఆర్డినెన్సు లనుపేర నిరోధక శాసనముల నేర్పరచిరి. దయలేకుండ రైతులను బాధింపజొచ్చిరి.

ఈపరిస్థితి ఇంగ్లండున కొన్ని తర్జనభర్జనలు జరిగి అందు కార్మికులోడిరి. కన్సరువేటివులు సభ్యులైరి. వీరు కార్మికులను కొంపరిని, కలుపుకొని జాతీయ ప్రభుత్వము పేర పూర్ణ సామ్రాజ్యతత్వముతో పాలనమారంభించిరి. లండనులో మన దేశపు రాజ్యాంగమును గూర్చి జరుగుచర్చ నిలిచిపోయినది. భారతీయులలో తమతమ శాఖల ప్రత్యేక సౌకర్యములను గూర్చి

తన తగవులు తెగలేదు. సేవకగు ఖర్చు రాజ్యాంగం వారి యాధీ నమున నుండి వదలమని బ్రిటిషు మంత్రులనిరి రౌండు టేబిలు సభ చెడి 1931 లో గాంధిగారు స్వదేశమునకు వచ్చిరి.

గాంధి యిర్విన్ షరతులకు ప్రభుత్వము భగ్నముచేయుచున్నందున గాంధిగారితో మాట్లాడుటకు భారతకాంగ్రెసు కార్యదర్శి యగు జవహారు బొంబాయికి బయలుదేరెను. క్రొత్తఆర్డినెన్సు ప్రకారము జవహారు ప్రయాగ వదలకూడదని సర్కారువారు నిషేధపుటాజ్ఞ జారిచేసిరి. ప్రయాగ జిల్లాలోనే సత్యాగ్రహము సాగుచుండెను. గాంధిగారిని చూచుటకు బొంబాయికి వెళ్ళుచుంటినని ప్రయాగమేజస్ట్రీటుకు తెల్పి షేర్వానీ గారితో కలిసి బొంబాయికి బయలుదేరెను. 26—12—31 ని వారి నుభయులను సర్కారువా రచటనే యరెస్టుచేసి జైలున కంపెను. అపుడు గఫ్ఫారును మొదలగు నాయకులు బెంగాలులో నరెస్టు చేయబడిరి. గాంధిగారు కాంగ్రెసు కార్యసంఘ సభ్యులందరు సభచేయుచుండగనే అరెస్టుచేయబడి జైలు కంపబడిరి.

## 18. ప్రజల సత్యాగ్రహము

దేశమంతటను సత్యాగ్రహ మారంభమైనది. సైనిక శాసనములను ఆర్డినెన్సులను. నిరంకుశశాసనములను సర్కారు వారు తీవ్రముగ ప్రయోగపరచ మొదలిడిరి. ఆశాసనముల నుల్లంఘించ పాటుపడుచు కాంగ్రెసు వాలంటీర్లు జైళ్ళు నిండు

చుండిరి. అపుడు జవహారు 20 నెలలపాటు జైలుననుండెను. ఆయన భార్యయు కొన్ని నెలల జైలుననుండి జబ్బు చేయగ విడువబడినది. తల్లి సోదరి శాసన ధిక్కారముచేసి జైలు కంపబడిరి.

సర్కారు ఆర్డినెన్సుల అమలుతో నిరోధములు హెచ్చినవి. కాంగ్రెసుసాత్తులను కాంగ్రెసు భవనములను ప్రభుత్వము వశపరచుకొనెను. పన్ను చెల్లించనందుకు జవహారు మొదలగు వారి యాస్తులుజప్తులయినవి. కాంగ్రెసువాలంటీర్లు చెదరగొట్టబడిరి. ప్రభుత్వమువారు ప్రచురించిన నూతన రాజ్యాంగము వంక మితవాదులు కాంగ్రెసువారు దృష్టి మరల్చిరి. దానియందు ప్రజల కేవిధమగు నధికారములేదు. కొన్ని యెన్నిక హక్కులు మాత్రముకలవు. ఈసమయమున హిందూమహమ్మదీయుల మధ్యభేదము హెచ్చెను. సత్యాగ్రహమీ కారణములచే సన్నగిల్లినది. ప్రభుత్వమువారి క్రొత్తరాజ్యాంగప్రణాళికలో శాసనసభలో హిందూమహమ్మదీయుల మధ్యనేగాక హిందువులలోనే అనేకభేదములు కల్పింపబడినవి. అంటరానివారగు హరిజనుల కేర్పడిన స్థానములను హిందువు లందరు గాకుండ హరిజనులే యెన్నుకొనవలయునని యేర్పరచిరి. వారిని సంఘమునుండి విడదీసిరి. కాంగ్రెసువారు ఎం. సి. రాజా మొదలగు వారగు హరిజననాయకులుగూడ ప్రత్యేక నియోజక వర్గము హరిజనులకుకూడదు. సమిష్టివర్గమే యుండవలెననిరి. హిందువు

లందరు యొప్పుకొనిన తామాపద్ధతిని మార్చెదమని సర్కారు వారు తెల్పిరి. హిందువులలో నట్టిన క్షీభావము లేదయ్యెను. ఈపద్ధతివలన భారతజాతీయులకు నష్టము కలుగునని ఐకమత్యము కలిగించ 1932 లో గాంధిగారుపవాస మారంభించిరి. అపుడు దేశమున మహాసంచలనముకలిగి నాయకులు పూనాలో కలసికొని యొకయొండబడిక చేసికొనిరి. దానితో నాసమస్య సరిచేయబడెను. ఆయొడంబడిక ప్రకారము హరిజనులయస్పృశ్యత తొలగించి వారికి దేవాలయప్రవేశమును కలిగింప హిందువులు పనిచేయ నాయకులు తీర్మానించిరి. హరిజనుల నుద్ధరింప హిందూనాయకులు శ్రద్ధతో పనిచేయుట లేదని యాపనికి ప్రాధాన్యము కలిగింప 1933 లో మరల గాంధిగారు 21 రోజుపవాసము చేసిరి. దేశీయులలో నాందోళన కలిగినది. ఈయుపవాసమున గాంధిగారు జైలునుండి విడుదలయై హరిజనుల యిబ్బందులు తొలగించు ప్రచారము గట్టిగ చేయదొడగిరి. దేశీయులదృష్టి సాంఘికసమస్యను లగ్నమయినది. హరిజనసేవకు గాంధిగారు గ్రామపరిశ్రమసంఘములును స్థాపించిరి. గాంధిగారికి సహచరులును వాలంటీర్లును కలసి పై వాటికై పాటుపడసాగిరి.

జవహరు జైలుపరిమితి పూర్తియగుననగా ఆయన తల్లికి చాల జబ్బుచేసినది. 1933 ఆగష్టు 30 న జవహరు విడుదలయ్యెను. తల్లికి ప్రమాదావస్థ తప్పినది. ఆతడు

వెంటనే పూనా వెళ్ళి గాంధిగారిని కలసి దేశస్థితినిగూర్చి మాట్లాడెను. కాంగ్రెసు సంస్థలు పనిచేయమి దేశస్థితి మందగింప జవహరు అఖిలభారతసంస్థకు సంయుక్తరాష్ట్రపు సంస్థకు పునర్జీవము పోయుదొడగెను. ఉపన్యాసముల మూలమున పత్రికల మూలమున కాంగ్రెసు ప్రచార మారంభించెను.

అపుడుత్తర బీహారులో 1934 జనవరి 15 వ తేదీని పెద్ద భూకంపము కలిగినది. అపుడు వేలకొలది ప్రజలు చనిపోయిరి. తక్కిన ప్రజలు నిలువనీడ తినతిండి లేక బాధపడు చుండిరి అది తెలియగనే నెహ్రూరు యచటకేగి బాధపడువారి సహాయమునకై కొన్ని నాళ్ళుండి అలహాబాదునకేగి నిరాధారులకు సహాయమునకు ద్రవ్యము పోగుచేయుచుండునెడ నతడు కలకత్తాలో యిచ్చిన యుపన్యాసములు రాజద్రోహకరములైనవను కారణమున నెహ్రూరు పట్టుకొనబడి కలకత్తా జైలును రెండేండ్ల ఖైదు విధింపబడెను. ఇది 1934 వ సం॥మున జరిగినది. దీనితో నతి డేడవసారి జైలు ప్రవాసియైనను ధైర్యముతో కావలసిన గ్రంథములను చదివి మంచి సంగతుల నెన్నిటినో ప్రజలకు తెలియ వ్రాసియుండెను.

కారాగారమున నతడుండగనే 1935 లో జవహరు భార్యకు జబ్బు బలమైనది. కమలనెహ్రూ మంచి శరీరబలము కలదికాదు. తన శక్తికి మించినపని నిరంతరము చేయుచుండు

టచే చాలకాలమునుండి యామె అనారోగ్యముచే బాధపడు చునే పతికన్నివిధముల తోడ్పడుచు కాంగ్రెసు విధుల ప్రికారము దేశసేవచేయుచు నాడువాండ్రను పురిగొల్పి సంఘముగ నేర్పరచి తర్ఫీతుచేసి వారికి జాతీయకార్య క్రమమును నేర్పి సత్యాగ్రహ సమయముల యందు విదేశపు బట్టల దుకాణములవద్ద స్త్రీ వాలంటీరులతో పికిటింగు చేయించుచు తాను పెత్తనము వహించి యాకార్యమున జయప్రదముగకొన సాగించెడిది. ఆమె చాల తడవలు జైలుకుపోయి వచ్చినది. దీనితో నామె యారోగ్యము పూర్తిగ చెడి జబ్బు హెచ్చయినది కాని తగ్గలేదు. జవహరు జైలునుండి రెండుమూడు తడవలామెను వచ్చి చూచుకొని తిరుగ జైలుకంప బడెను. రాను రాను కమలానెహ్రూ వ్యాధి హెచ్చినది, అపుడామెను కొమారెతో సహ డాక్టరులు స్విట్జర్లండు తీసికొని పోయిరి. అచట నామె యారోగ్య మొకవిధముగనుండి యుండి ప్రమాదస్థితికి మారినది. అపుడు జవహర్‌లాలుగారు కారాగారమునుండి విడిచివేయబడిరి, వెంటనే యతడు వాయువిమానముపయి స్విట్జర్లండుకు పోయి భార్యను కలసికొని ఘనవైద్యులచే చికిత్స చేయించెను. కొంచెము గుణమిచ్చినట్టు కనపడ నాసమయమున జవహరు భారతదేశపు పరిస్థితులను గూర్చి జర్మనీ ఆస్ట్రియా మొదలగు దేశములలోను యింగ్లండులోను గూడ నుపన్యాసములద్వారా ప్రచారము సలుపుచుండ

నాతని భార్యకు వ్యాధి హెచ్చి 1936 ఫిబ్రవరి 28 వ తేదీని సాధ్వీమణియగు నాధీరోధాత్తురాలు జీవితము చాలించినది. దానిని గని జవహరు చింతాసముద్రమున మునిగెను.

ఈ వీరపత్ని జ్ఞాపకార్థ మలహాబాదున గట్టబడిన వైద్య శాలకు గాంధిమహాత్ముడు 1939 సం॥ నవంబరు 16 వ తేదీ ఆదివారమునాడు శంఖుస్థాపనముచేసెను. ఆమె బ్రతికియున్నంతవరకు భారతీయతను విడువలేదు. భర్త జైలున కేగినపుడు సీతవలె వెంటాడినది. ఆమె యందింత దేశభక్తి కలదని తెలియవచ్చినపుడు లోకము వింతపడు టాశ్చర్యముకాదు. ఆమె విదేశమున చావుబ్రతుకులలో వున్నప్పుడు భర్త చెంత నుండెను. ఆ స్థితియందామె భారతదేశ పరిణామమును తెలిసికొని భర్తను వెంటనే విమానముపై మాతృభూమికి చన హెచ్చరించినది. ఎంత దేశభక్తియామెకున్నది. ప్రాణముకన్న దేశసేవ ముఖ్యమని తలచిన యీామె స్మారకచిహ్న మలహాబాదునకే గాక భారతదేశమునకు మంచి యాదర్శముగదా.

వేనవేలు ప్రజలు భారత కాంగ్రెసు నాయకులు, మాజీ, ప్రధాను లుండగ శంఖుస్థాపన చేయుచు మహాత్ముడు ఆమె అసాధారణవ్యక్తి భర్తకు ప్రేమించినటులనే మాతృదేశమును ప్రేమించినది. ఆమె యేపనియు బడాయికొరకు చేయలేదు. కాంగ్రెసు వైద్యశాలపై నామె కాశక్తిమెండు వైద్యచికిత్సకు యూరపున కేగుచు వైద్యశాలను జాగ్రత్తగ చూడుమని

నా మెతో చెప్పినది. కమలఆత్మకు భగవంతుడు శాంతి నొసంగు గాక! అని పలికియుండెను.

ఇంతటి యవస్థలో నుండియు జవహారు భారతదేశము యొక్క పరిస్థితి యేకోద్దిమందిచేతనో నిర్ణయం కావాలని సర్. సికిందరు హయత్తానుగారు సూచించిన విని యీప్రకారము చేయబడే రాజ్యాంగము ప్రజాసామాన్యాది ననుకూలమైనదిగ నుండజాలదని ప్రజలకందరికీ అనుకూల రాజ్యాంగాన్ని నమకూర్చాలంటే దానిని ప్రజలే నిర్మించుకోవాలని వెనుకటి నిరాధారస్థితి రైతుకిపుడు లేదు. ఇతరదేశీయులు మనసత్యాగ్రహము సంగతివిని మన నిపుడు గౌరవభావముతో చూచుచున్నారు. ఏపరదేశమునకు వెళ్ళినా మిమ్మల్ని రెండుసంగతులడుగుతారు. ఒకటి గాంధీగారిని గూర్చి రెండవది కాంగ్రెసును గూర్చి కాంగ్రెసులో కొంత లోపమున్నది. పెద్దసంస్థలలో లోపముండకపోదు. కాని కాంగ్రెసువారందరు నడుమకట్టి పని చేసినచో మనకోరిక నెరవేరకమానదని యనేక ప్రదేశములలో నుపన్యాసము జవహారు చేయుచుండెను.

ఈ సమయముననే సింహళములోని భారతదేశీయులకు జరుగుచున్న యక్రమమును వారు పడుచుండు యిడుములకును తగిన ప్రక్రియను సలిపి యుభయులకును అనుకూలములను తగు విధమున నేర్పాటు చేయుటకు 1939 జూలయి నెలలో జవహారు సింహళమునకు భారపదేశపక్షపు రాయభారిగ

కాంగ్రెసు కమిటీవారిచే పంపబడెను. యీతడు సింహాళదేశము నకు చేరిన వెంటనే భారతీయులే గాక సింహాళదేశీయులు కూడ దేశనాయకుడగు జవహరులాలుగారికి యఖండస్వాగతము నొసంగి సన్మానించిరి.

కార్యక్రమము ననుసరించి జవహరు ప్రజలతో నిండిన యీసభలందు పలుతావుల నుపన్యాసముల నిచ్చుటయేగాక సింహాళదేశపు మంత్రులకు తన భావములను తెలియపరచి వారి భావములను సాఫల్యముగవిని సఖ్యముకుదురు మార్గమును సూచించి వారలనొడంబడునట్లు చేసెను. దీనికితోడు భారత ప్రభుత్వమువారు కూడ నీవిషయమున కలుగజేసికొనగనే సింహాళ ప్రభుత్వపు రాజ్యాంగ విధానమున భారతీయుల కను కూలములగు చాలమార్పులుజరిగినవి. జవహరుని రాయభారము భారతదేశీయులకును సింహాళదేశీయులకును సఖ్యతకలిగించుట కెంతయేని యుపయోగపడినది. శాశ్వతసంబంధము రెండుదేశ ములకీ రాయభారము సమకూర్చినదై చెలగినది.

జవహరచ్చట చైనాదేశమునకు జపానువారివలన గలుగు చున్న దుర్భరస్థితి వినినంతనే చాల జాలికలిగి వారియిక్కట్టు లను చూడవలెనని తలంపు గలుగుటయేగాక కొద్ది బలవంతు లగు అసహాయులను పరదేశీయులు క్రూరముగ హింసించి వారి స్వేచ్ఛకు భంగము గలిగించుట కూడని పనియని తోచు టచే నలడచటనుండి 20 ఆగష్టు 1939 సం॥ తేదీని హిందూ దేశమునకు చైనాపై గల స్నేహభావమును తెలుపుటకుగాను

రాయబారిగచని వచ్చినపని నెరవేర్చుకొనులోపల జపాను విమానముల యలజడిచే యచట నిలువక భారతదేశమునకు చనుదెంచెను.

అతఁడు వచ్చినప్పటినుండియు తనయుద్యమము మానక ప్రజలకు తనభావములను చక్కఁగ వెల్లడించి వారి స్వదేశాభిమానమును పురికొల్పు తలంపుతో యు. పి. రాష్ట్రమందె గాక పలుదేశములలో ప్రజలకు వారు వర్తించవలసిన సంగతులను చక్కఁగ బోధించుచు, వారి తగువులాటలను సరిచేయుచు సంఘీభావమేర్పడునట్లు మిగుల పాటుపడి తానుపన్యసించిన ప్రదేశవాసులవల్ల నొకత్రాటినీాడికి తేజాలుచుండెను.

ఈకార్యక్రమమున నిమగ్నుడైన జవహరుచర్య భారత ప్రభుత్వమువారికి వెగటుగదోచి యతడంతకుముందు గోరఖపూరున నిచ్చిన యుపన్యాసములు చట్టసమ్మతమైనవి కావని నేరములు మోపి యరెస్టుచేసి పండిత జవహరులాలునెహ్రు గారిని గోరఖ్‌పూరు మేజస్ట్రీటుగారి కోర్టున చార్జీ పెట్టిరి. సదరు మేజస్ట్రీటుగారు విచారించి మూడు నేరములకు— నేరము 1 కి 16 మాసముల చొప్పున నాలుగేండ్లు శిక్ష విధించిరి. ఇప్పటి కింతటితోసరి—

సంపూర్ణము.

---

వేణు ప్రెస్, రాజమండ్రి. ఇ. జి, 51 కా 1000 23-11-46